# కామరత్న తంత్రం

(నిత్యనాథ సిద్ధుని ప్రాచీనతంత్ర శాస్త్రం)

# హేవజ్ర తంత్రము

(బౌద్ధవామ తంత్ర విశేషాలు)

బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్‌కుమార్

విద్యాప్రవీణ, M.A. సంస్కృతం.,

ప్రచురణ కర్తలు

ఫోన్ : 2465253

గొల్లపూడి వీరాస్వామి సన్

పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్

కోటగుమ్మం - రాజమండ్రి - 1



2007

వెల : 35.00

# కామరత్న తంత్రం

(నిత్యనాధ సిద్ధుని ప్రాచీనతంత్ర శాస్త్రం)

# హేవజ్ర తంత్రము

(బౌద్ధవామ తంత్ర విశేషాలు)

రచన :

**మేడవరపు సంపత్ కుమార్ సిద్ధాంతి**

4-399 "విశ్వామిత్ర"

తారకరామనగర్, నరసింహరోడ్

కాకినాడ - 533 002

ఫోన్ : 9849354393

మీ సందేహాలకు మరియు సలహాలకు రచయితనే సంప్రదించగలరు.

ముఖచిత్రాలంకరణ :

**కె.బి. క్రియేషన్స్**

రాజమండ్రి ., ఫోన్ : 2464707

గ్రంథ ముద్రణ :

**శ్రీ మహేశ్వరీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

రాజమండ్రి - 533 104., ఫోన్ : 2478594.

ముఖచిత్ర ముద్రణ :

**ఈశ్వర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

రాజమండ్రి - 533 103., ఫోన్ : 2475373

ప్రకాశకులు :

**గొల్లపూడి వీరాస్వామి సన్**

కోటగుమ్మం - రాజమండ్రి., ఫోన్ : 2465253

# తంత్రపీఠిక

భారతీయ విద్యలలో 'తంత్రశాస్త్రం' ఒక గొప్ప విద్య. ఇది మానవజాతి శ్రేయస్సుకు, దీనుల దరిద్రుల-రోగ-ఋణ-శత్రు బాధలు పొందు వారికి ఉపశమనం కలిగించి సుఖ సంతోషములు ప్రాప్తింపచేయునది.

ఇది కత్తి వంటిది. అపకారానికి, ఉపకారానికి రెండింటికీ ప్రయోగించవచ్చు.

అక్షరములలోని స్పందనశక్తి - మంత్రం
వస్తువులలోని స్వభావశక్తి - తంత్రం
మంత్రానుష్ఠానానికి గురువు అవసరం

నిష్కారణంగా అమాయకులపై - సత్పురుషులపై అభిచారాది ప్రయోగములు ఫలితమివ్వవు సరికదా, తిరిగి ప్రయోక్తకే చేటు కలుగును.

కామరత్నతంత్ర ప్రణేత
నిత్యనాథ సిద్ధుడు. ఇతడు గొప్ప రససిద్ధయోగి.
సుమారు క్రీ॥శ 8 వ శతాబ్దికి చెందిన వాడుగా భావించబడుతున్నాడు. ఈయన మరొక గొప్ప రచన "రసరత్నాకరము" అందుదేహవేధ - లోహవేధ చెప్పబడ్డాయి. ఇతడు నాథ సంప్రదాయమునకు చెందిన రసయోగి.
దీని వలన సాధకులు శ్రేయోస్సు పొందగలరని భావిస్తున్నాను.

8.3.2005
మహాశివరాత్రి **మేడవరపు సంపత్‌కుమార్**

# కామరత్న తంత్రం

(నిత్యనాథ సిద్ధుని ప్రాచీనతంత్ర శాస్త్రం)

బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్‌కుమార్

విద్యాప్రవీణ, M.A. సంస్కృతం.,

## కామరత్న తంత్రం - విషయసూచిక


1. అధకామ రత్నం - 7
2. షట్ కర్మలు - 7
3. తిథి నిర్ణయం - 7
4. వార నిర్ణయం - 8
5. ఔషద బలము - 9
6. గ్రహణవిధి - 9
7. త్రవ్వుట - 10
8. వశీకరణం - 11
9. సర్వజనవశీకరణయంత్రాలు - 14
10. సన సన దేవదత్త వశంకురు స్వాహా - 16
11. రాజవశీకరణం - 21
12. రాజవశీకరణ యంత్రం- 22
13. స్త్రీ వశీకరణం - 23
14. సః దేవదత్త సః - 24
15. విశ్వ చేటక మంత్రం - 25
16. పతివశీకరణం - 25
17. ఆకర్షణం - 26
18. స్త్రీఆకర్షణయంత్రములు - 26
19. జయమంత్రములు - 28
20. జయకరయంత్రములు - 29
21. సౌభాగ్యకరం - 29
22. కోపము తగ్గుట - 30
23. స్తంభనం - 30
24. నిద్రాస్తంభన - 32
25. అగ్ని స్తంభన - 32
26. జంతు స్తంభనం - 32
27. మనుష్య స్తంభనం - 33
28. శతృ బుద్ధి స్తంభనం - 34
29. గర్భ స్తంభన - 34
30. శుక్ర స్తంభన - 34
31. మోహనం - 36
32. కేశములకు రంగు - 37
33. పేలు నశించును - 37
34. పేను కొరుకుడు - 37
35. వాజీ కరణం - 37
36.స్త్రీసంగమ కాలం - 39
37. గాఢీ కరణం - 39
38. ద్రావణం - 40
39. లింగ స్థూలీకరణం - 41
40. లోమ శాతనం - 41
41. వంధ్యా దోష నివారణ - 41
42. బాలరక్ష - 43
43. కలహకరణం - 44
44. సర్పారిష్టనాశకరక్షవిధి - 44
45. నిద్రాకరణం - 45
46. నిద్రానాశనం - 46
47. బంధమోచనం - 46
48. ఉచ్ఛాటనం - 46
49.విద్వేషణం - 49
50.శతృభ్రామణం - 50
51. ఉన్మత్తీ కరణం - 50
52. సర్వసిద్ధి యంత్రం - 51
53. వాక్సిద్ధి - 52

54. గుప్తనిధుల అన్వేషణ - 52
55. ధన ధాన్య అక్షయం - 53
56. భాహ్మి ఘృతం - 53
57. కిన్నరస్వరం - 54
58. చక్షుష్యం - 54
59. కర్ణపాలీ వర్ధనం - 55
60. దంతదృఢీ కరణం - 55
61. ఆహార కరణం - 55
62. అనాహార కరణం - 56
63. పాదుకా సాధనం - 56
64. మేఘస్తంభన - 57
65. వర్షము కురియుటకు - 57
66. అంజన విద్య - 58
67. మరియొక ప్రయోగం - 60
68. మృత సంజీవని - 61
69. త్రిలోహ ఉంగర మహిమ - 65
70. యంత్ర లేఖీనులు - 66
71. యంత్రసిద్ధికిమూలము - 66
72. పంచదశీ యంత్రము - 67
73. వింశతి యంత్రము - 69
74. నవగ్రహ యంత్రములు - 70
75. చండీ యంత్రములు - 77

## హేవజ్ర తంత్రం - విషయసూచిక

76. తంత్రపీఠం - 79
77. హేవజ్రతంత్ర విశేషాలు - 85
78. వజ్రకులం - 90
79. 32 నాడుల పేర్లు - 92
80. మంత్రపటలం - 95
81. కరువు ఏర్పడినపుడు నివారణ - 97
82. శతృసేనా నాశనం - 98
83. వశీకరణము - 99
84. వజ్ర జ్యోతిష విధి - 100
85. దేవతా పటలం - 100
86. దేవతాభిషేకం - 103
87. తత్త్వం - 103
88. చర్య (సాధన) - 106
89. చోమా (రహస్య గుర్తుల వివరణ) - 108
90. యోగినీ చక్రం - 109
91. విశుద్ధి - 110
92. అభిషేకము - 112
93. కల్పరాజం - 113
94. సిద్ధి నిర్ణయం - 115
95. సాధనోపాయం - 116
96. సర్వతంత్రముద్రణపిండార్థం - 119
97. హేజ్రాభ్యుదయం - 121
98. ఆయుధములు - 123
99. పటవిధానం - 125
100. భోజన పటలం - 126
101. వినేయ పటలం - 126
102. జాప పటలం - 127
103. సహజార్థ పటలం - 128

ఓం తంత్రాయణే నమ:

శ్రీ గురుచరణారవిందాభ్యాం నమ:

# అథ కామరత్నం

శ్లో॥ యస్యేశ్వరస్య విమలం చరణారవిందం
సంసేవ్యతే విబుధ విద్ధ మధువ్రతేన
నిర్వాణసూచక గుణాష్టక వర్గపూర్ణం
తం శంకరం సకల దు:ఖహరం నమామి॥

## షట్కర్మలు

1. శాంతి పుష్టి 2. స్తంభన 3. వశ్యం
4. విద్వేషణం 5. ఉచ్చాటనం 6. మారణం

వసంత ఋతువునందు - వశ్యాకర్షణ కర్మలు ఫలప్రదం
గ్రీష్మమందు - విద్వేషణ
వర్ష ఋతువునందు - స్తంభన; హేమంతం=ఉచ్చాటన
శిశిరమందు - మారణ కర్మలు సఫలమవుతాయి

## తిథి నిర్ణయం

సప్తమియందు = వశీకరణము
తదియ - త్రయోదశి = ఆకర్షణ కర్మ
విదియ - షష్ఠి = ఉచ్చాటన
పాడ్యమి - చవితి - చతుర్ధశి = విద్వేషణకర్మ

నవమి - అష్టమి = మోహనకర్మ
ఏకాదశి - ద్వాదశి = మారణ కర్మ శీఘ్రముగా సిద్ధించును
పంచమి - పున్నమి = శాంతి పుష్టి కర్మలు ఆచరించాలి.

## వార నిర్ణయం

ఆదివారం - మారణ
మంగళవారం - విద్వేషణం
బుధవారం - ఉచ్చాటనం
శుక్రవారం - శాంతికర్మ
శనివారం - వశీకరణం, సిద్ధిస్తాయి.

జ్యేష్ఠ - ఉ॥షా - అనూరాధ - రోహిణి ఇవి మహేంద్ర మండల నక్షత్రములు, ఇందు స్తంభన, మోహనములు శీఘ్రముగా సిద్ధిస్తాయి.

ఉ॥భాద్ర - మూల - శతభిషం - పూర్వాభాద్ర - ఆశ్లేష ఇవి వరుణ మండల నక్షత్రములు ఇందు వశీకరణము శీఘ్రముగా సిద్ధిస్తుంది.

స్వాతి - హస్త - మృగశిర - చిత్ర - ఉత్తర - పునర్వసు - పుష్యమి ఇవి అగ్నిమండల నక్షత్రములు ఇందు విద్వేషణ - ఉచ్చాటన కర్మలు శీఘ్రముగా సిద్ధిస్తాయి.

అశ్విని – భరణి – కృత్తిక – ఆర్ద్ర – పుబ్బ – మఖ శ్రవణం – ధనిష్ఠ ఇవి వాయు మండల నక్షత్రములు ఇందు విద్వేషణ – ఉచ్చాటన కర్మలు సిద్ధించును.

## ఔషధ బలము

విధి, మంత్రయుక్తముగా గ్రహించిన ఓషధులు మాత్రమే సఫలమగును. మంత్ర పూర్వకముగా లేని ఓషధులు కేవలం కర్రపుల్లలే అగును.

ఏ కాంతముగా అరణ్యమునందు నరుని దృష్టి పడనిచోటే ప్రభావ శాలియగు ఓషధులను గ్రహించవలయును. ఇతరములందు గ్రహించరాదు.

## గ్రహణవిధి

ప్రాత: కాలమునందు లేచి కాలకృత్యములు తీర్చుకొని శివపూజ గావించి, వృక్షము వద్దకు వెళ్ళి ఈ క్రింది మంత్రముతో అభిమంత్రించ వలయును.

**శ్లో॥ ఓం భేతాళాశ్చ పిశాచాశ్చ రాక్షసాశ్చ సరీసృపా: ॥**
**అపసర్పంతు తే సర్వే వృక్షాదస్మాత్ శివాజ్ఞయా॥**
**ఓం నమస్తే అమృత సంభూతే బల వీర్య వివర్ధని**
**బలమాయుశ్చ మేదేహి పాపాన్మే్త్రాహి దూరత:॥**

## త్రవ్వుట

ఓషధి యొక్క వేరు గ్రహించుటకు ఈ క్రింది మంత్రము పఠించుచూ త్రవ్వవలయును.

మం - యేనత్వాం ఖనతే బ్రహ్మాయేనత్వా ఖనతే భృగు:
యేనహేంద్రో్న ధవరుణో యేనత్వామప చక్రమే ॥
తేనాహం ఖనయిష్యామి మంత్రపూతేన పాణినా
మాపాతేమాని పతితే మాతే మాతే తేజోన్యధ భవేత్॥
అత్రైవతిష్ఠ కల్యాణి మమ కార్యకరీభవ
మమ కార్యే కృతే సిద్ధే తత:స్వర్గం గమిష్యసి
'ఓం హ్రీం చండే హూం ఫట్ స్వాహా'

అను మంత్రముతో పుష్యమీ నక్షత్రం ఆదివారం రోజున మూలికను పెకలించవలయును.

ఓం హ్రీం క్షాం ఫట్ స్వాహా! ఓం సూత్రీ కపాల మాలినీ స్వాహా - ఏడు సార్లు పఠించి బదనికను గ్రహించ వలయును.

బదనికను గ్రహించుటకు మరొక ప్రత్యేక మంత్రము తంత్రాంతరములో ఈ విధముగా చెప్పబడినది.

ఓం వనదండే మహాదండాయస్వాహా ఓం శూద్రీ కపాల మాలినీ స్వాహా"

## వశీకరణం

మంత్రం - క్రోం ప్రోం వ్రోం

ఈ మంత్రముచే అసాధ్యులైన రాజ-పుత్ర-మిత్ర బాంధవుల నెల్ల వశము చేసుకొనవచ్చు. దీనిని 500 మార్లు జపించాలి.

ఇది గురుముఖంగా గ్రహిస్తే సిద్ధి.

"ఓం నమో కటవికట ఘోరరూపిణీ స్వాహా"

ఈ మంత్రము 7 సార్లు అభి మంత్రించి భోజనములో మొదటి ముద్దను తినవలయును. ఈ విధముగా 7 రోజులు చేసినచో ఎవరి పేరున తిందుమో వారు వశులగుదురు.

ఓం వశ్యముఖీ రాజముఖీ స్వాహా॥ ఈ మంత్రముతో ఉదయమున 7 సార్లు ముఖము ప్రక్షాళన చేసుకొన్నచో వశీకరణము సిద్ధించును.

ఓం చాముండే జయజయ స్తంభయ స్తంభయ మోహయ మోహయ సర్వ సత్వాన్నమ: స్వాహా।

ఈ మంత్రముతో పూలను అభిమంత్రించి ఎవరికిచ్చెదమో వారు వశులగుదురు.

ఈ మంత్రమును ఏకాగ్రతతో 30 వేలు జపించిన సాధకుడు తన దృష్టి మాత్రము చేతనే ఎదుటి వారిని ఆకర్షించగలడు.

శాఖోటక వృక్షము యొక్క వేరు సమంత్రకముగా గ్రహించి, దానిని నూరి విభూతితో కలిపి ధరించినచో జనులు మోహితులగుదురు.

పుష్యమి నక్షత్రము రోజున పునర్నవా మూలమును సమంత్రకముగా గ్రహించి ఈ క్రింది మంత్రముతో అభిమంత్రించి ధరించినచో సభావశ్యము పూజ్యభావము కలుగును.

ఐం రౌండం క్షోభయ భగవతి త్వం స్వాహా॥

ఈ మంత్ర సిద్ధికి ముందు 20 వేలు దీనిని జపించ వలయును.

ఉత్తరేణి మూలమును గోరోచనముతో నూరి తిలకముగా ధరించినచో లోక వశ్యమగును. ఈ క్రింది మంత్రమును ముందుగా సిద్ధించు కోవాలి.

ఓం కందర్ప శరవిజాలిని మాలిని సర్వలోక వశంకరి స్వాహా।

1008 సార్లు జపిస్తే సిద్ధి.

మాస శివరాత్రి నాడు గాని - బహుళాష్టమి నాడుగాని ఉపవాసముండి సహదేవి మూలికను సమంత్రకముగా గ్రహించి, బలి సమర్పించి చూర్ణము చేయాలి. దానిని ఎవరికి ఇస్తే వారు వశులగుదురు. దీనిని స్నానము చేయునపుడు ఆ జలములో కలిపిననూ, శరీరమునకు పూసికొనిననూ సభావశ్యమగును.

**శ్లో॥ రోచనా సహదేవీభ్యాం తిలకం లోకవశ్యకృత్**

అని శాస్త్రవచనం.

సహదేవి మూలమును నడుముకట్టిన ఆ స్త్రీ వశురాలగును. దీనికి మంత్రము.

ఓం నమో భగవతి మాతంగేశ్వరి సర్వముఖ రంజని సర్వేషాం మహా మాయే మాతంగి కుమారికే లహలహ జిహ్వే సర్వలోక వశంకరి స్వాహా।

వేయిసార్లు జపించిన సిద్ధించును.

శ్వేతపారి జాతమూలము చంద్రగ్రహణమునాడు సమంత్రకముగా గ్రహించి, చూర్ణము చేసి గోరోచనముతో కలిపి తిలకముగా ధరించిన సభావశ్యమగును.

బహుళ త్రయోదశినాడు శ్వేత గుంజా మూలమును తాంబూలంతో కలిపి ఇచ్చిన వశమగును.

రోహిణీ నక్షత్రము రోజున మర్రి బదనికను గ్రహించి చేతికి ధరించిన జనవశీకరణ శక్తి లభించును. ఇది విశ్వామిత్రుడు చెప్పినది.

**శ్లో॥ రోహిణ్యాం వటవందాకం సంగ్రాహ్యాధారయేత్కరే**
**వశ్యంకరోతి సకలం విశ్వామిత్రేణ భాషితం॥**

కుంకుమపువ్వు - నందివర్ధనం - కంకుష్ఠం - హరితాళం - సమంగా కలిపి, అనామికా వేలి రక్తంతో మేళవించి తిలకం ధరించినచో కార్యసిద్ధి కలుగును.

పుష్యమీ నక్షత్రం రోజున తెల్లజిల్లేడు మూలం గ్రహించి, మేక మూత్రముతో నూరి, తిలకముగా ధరించిన జగద్వశ్యమగును.

## సర్వజనవశీకరణ యంత్రాలు

ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై రక్తచందనంతో వ్రాయలి 'దేవదత్త' అనుచోట ఎవరిపై ప్రయోగింతుమో వారిపేరు వ్రాయాలి.

అనంతరం నెయ్యి, తేనెలందు 3 రాత్రులుంచాలి. ఆ వ్యక్తి మనకనుకూలమగును.

| రుంతుంరుం | రుంతుంరుం | రుంతుంరుం |
|---|---|---|
| రుంతుంరుం | దేవదత్త వశమానయ స్వాహా | రుంతుంరుం |
| రుంతుంరుం | రుంతుంరుం | రుంతుంరుం |

ఈ క్రింది యంత్రము భూర్జ పత్రముపై గోరోచనముతో దానిమ్మ పుల్లతో వ్రాసి నిత్యమల్లి చెట్టు క్రింద పాతిపెట్టినచో అతడు వశమగును. ఆ చెట్టును రాత్రి వేళ యందు నీళ్లతో తడుపవలెను.



ఈ క్రింది యంత్రమును అనామికా వేలి రక్తముతో కలసిన గోరోచనముతో లిఖించి తేనె యందుంచినచో అతడు వశమగును.




ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై గోరోచనముతో లిఖించి ఎర్రదారముతో కట్టి నోటియందుంచుకొని ముందుగా ఎవరిని చూతుమో వారు వశమగుదురు.

**సన సన దేవదత్త వశంకురు స్వాహా**

ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై గోరోచనముతో వ్రాసి తేనెలో ఉంచిన ఎడల వశీభూతుడగును.




ఈ క్రింది యంత్రమును రక్తచందనముతో భూర్జ పత్రముపై లిఖించి నీళ్లలో ఉంచిన వశమగును.

హ్రీం దేవదత్త హ్రీం

ఈ క్రింది యంత్రము మల్లెపూలు, జిల్లేడుపాలు కలిపి భూర్జ పత్రముపై లిఖించి భుజమునకు ధరించిన ఎడల ఆ వ్యక్తి వశుడగును.



ఈ క్రింది యంత్రము భూర్జపత్రముపై గోరోచనముతో లిఖించి తేనెయందుంచిన వశుడగును.




ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై గోరోచనముతో సాధ్యవ్యక్తి పేరును లిఖించి పూజామందిరము వద్ద ఉంచినచో వశుడగును.




ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై అనామికా రక్తముతో లిఖించి, చేతికి గాని, కంఠమునందు గాని ధరించిన అతడు అనుకూలమగును.




ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై గోరోచనముతో లిఖించి, తేనెయందుంచిన సాధ్యవ్యక్తి అనుకూలమగును.



ఈ క్రింది యంత్రమును కుంకుమ పువ్వు, గోరోచనము, అనామికా రక్తముతో కలిపి, దానిమ్మ పుల్లతో భూర్జ పత్రముపై వ్రాసి నిప్పులపై కాల్చినచో సాధ్య వ్యక్తి అవశ్యము వశ్యమగును.




ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై గోరోచనముతో లిఖించి, ఎర్రని దారము చుట్టి, చేతికి కట్టుకొనిన ఎడల ఆ వ్యక్తి  అనుకూలుడగును.



ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై గోరోచనముతో లిఖించి, తాను ధరించిన వస్త్రములో నుంచు కొనిననూ కంఠ మందుగాని, బాహువులందుగాని, ధరించిననూ అతడు శత్రువయిననూ అనుకూలమగును.




## రాజవశీకరణం

కుంకుమ పువ్వు గోరోచనం – చందనం – కర్పూరం కలిపి ఆవు పాలతో నూరి తిలకం నిత్యం ధరించిన అధికారులు అనుకూల మగుదురు. ఇది నిశ్చయం. ఈ క్రింది మంత్రముతో అభిమంత్రించాలి.

ఓం హ్రీం సః దేవదత్తం వశమానయ స్వాహా వెయ్యి జపిస్తే మంత్రసిద్ధి. కార్యసిద్ధికి 7 సార్లు అభిమంత్రించాలి.

సంపెంగ బదనిక భరణీ నక్షత్రము రోజున విధి పూర్వకముగా గ్రహించి, చేతికి ధరించిన పై అధికారులు అనుకూలము గానుందురు.

## రాజవశీకరణ యంత్రం

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ

శ్రీం శ్రీం ది త్యా ఇ ఞ ఝ

దేవదత్త
క్షోం యూం కూం

ఎ ఐ ఒ ఔ అం అః క

జ ఛ చ ఙ ఘ గ ఖ

పై యంత్రమును కుంకుమ పువ్వుతో భూర్జ పత్రముపై లిఖించి, తన దగ్గర ఉంచుకొనిన అధికార వశీకరణమగును.

ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై గోరోచన కుంకుమ పువ్వు కర్పూరముతో సాధ్యనామముతో నెయ్యి తేనెలలో 3 రోజులుంచి, ఎర్రపూలతో పూజించిన ఎంతటి అధికారి అయినా వశమగును.




## స్త్రీ వశీకరణం

పుష్యమీ నక్షత్రము రోజున నల్ల ఉమ్మెత్త పూవును, భరణీ నక్షత్రం రోజున ఫలము, విశాఖనాడు కొమ్మ, హస్త యందు ఆకులు, మూలయందు వేరు క్రమముగా గ్రహించి, కర్పూర ముతో నూరి, కుంకుమ పువ్వు, గోరోచనం కలిపి తిలకముగా ధరించి ఏ స్త్రీ అయిననూ వశమగునని శాస్త్రవచనము.

కాకజంఘ–వచ–కంకుష్ఠం – ఇవి శుక్రశోణి తములతో కలిపి "ఓం నమోభగవతే రుద్రాయ ఓం చాముండే అముకీం మే వశమానయ స్వాహా అనే మంత్రముతో అభిమంత్రించి ఏ స్త్రీ చేత తినిపింతుమో ఆమె అనుకూలవతి అగును.

'ఓం నమఃక్షిప్రకామిని అముకీం మే వశమానయ స్వాహా, అనే మంత్రముతో ప్రాతః కాలమందు 7 సార్లు పఠించుచూ

ముఖమును 7 సార్లు కడిగిన ఎడల, ఆ స్త్రీ అనుకూలవతి అగును. 7 సార్లు అభిమంత్రించి జలపానము కూడా చేయవలయును.

ఓం హూం స్వాహా అను మంత్రముతో కృష్ణ పారిజాతము యొక్క వేరును తాంబూలముతో తినిపించిన ఎడల ఆమెవశురాలగును.

ఓం హుం స్వాహా మంత్రముతో తనపేరు – స్త్రీ పేరు జోడించి 7 సార్లు పూలను అభిమంత్రించి ఆమెకు ఇచ్చినచో అనుకూలవతి అగును.

మంగళవారం, విశాఖా నక్షత్రము రోజున, దారుహరిద్రా వేరును తెచ్చి, చేతికి ధరించిన ఎడల స్త్రీ వశ్యమగును.

ఈ క్రింది యంత్రము భూర్జ పత్రముపై కుంకుమపువ్వు – అనామికా రక్తము – గోరోచనము కలిపి సాధ్యవ్యక్తి నామము లిఖించి పూలు నిత్యమూ పూయు వృక్షము కింద గాని, నెయ్యిలో గాని ఉంచినచో వారం రోజులలో వారు వశులగుదురు.

**సః దేవదత్త సః**

పుష్యమీ నక్షత్రం రోజున రుద్రజడవేరు నోటి యందుంచు కొని, కొంత చూర్ణము తాంబూలము నందుంచి ఏ స్త్రీకి ఇచ్చిన ఆమె అనుకూలవతి అగును.

పాటలి చెట్టు వేరు చూర్ణము కూడా వశీకరణమునకు ఉపయోగించును.

## విశ్వ చేటక మంత్రం

ఈ క్రింది మంత్రమును ఏకాగ్రతతో రాత్రియందు 15 రోజులు 20 వేలు జపించిన సిద్ధించును.

ఐం పి స్యాం క్లీం కామ పిశాచిని శీఘ్రం అముకీం గ్రాహయ గ్రాహయ కామేన మమ రూపేణ నఖైర్విదారయ విదారయ, విద్రావయ విద్రావయ స్నేహేన బంధయ బంధయ శ్రీం ఫట్॥

## పతివశీకరణం

ఖంజరీటపు మాంసమును తేనెతో నూరి, తనయోనికి కొంత పూసుకొని భర్తతో సంగమించినచో అతడు ఆమెకు వశవర్తియై యుండును.

చిత్రక పుష్పములు తేనెతో కలిపి భర్తకు తినిపించినచో అతడు ఆమెకు వశుడైయుండగలడు.

గోరోచనం -కుంకుమపువ్వు-వట్టివేరు వీటి చూర్ణమును తిలకముగా ధరించినచో పతి అనుకూలుడై యుండును. ఇది వాత్సాయన ఋషి చెప్పినది.

## ఆకర్షణం

ఓం ఘూం ఘూం ఘూం హాం హాం హాం హేం హేం ఈ మంత్రము 500 సార్లు జపించిన సిద్ధించును. దూరమున ఉన్న వ్యక్తి ఆకర్షితుడై రాగలడు.

ఈ క్రింది మంత్రము 10 వేలు జపించిన సిద్ధించును.

ఓం హ్రీం రక్ష రక్ష చాముండే తరుతురు అముకీం ఆకర్షయ ఆకర్షయ హ్రీం – అముకీం అనుచోట ప్రయోగించు నపుడు ఇష్ట స్త్రీ నామము చేర్చవలయును.

## స్త్రీ ఆకర్షణ యంత్రములు

ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై గోరోచనము, కుంకుమ పువ్వు మిశ్రమ చూర్ణముతో లిఖించి నెయ్యి యందుంచినచో ఆ స్త్రీ ఆకర్షితురాలగును.



ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై చందనముతో లిఖించి తేనె యందుంచి ఒక సీసాలో బంధించి భూమిలో పాతినచో ఆమె శీఘ్రమే ఆకర్షితురాలగును.




సూర్యావర్తి వేరు పంచమి దినమున సమంత్రకముగా గ్రహించి తాంబూలమునందు తినిపించినచో స్త్రీ వశీకరణ మగును.

'ఓం కృష్ణవర్ణాయ స్వాహా' అను మంత్రమును లక్షసార్లు జపించి ముందుగా సిద్ధించుకొనవలయును. అనంతరము మైధునమందున్న తుమ్మెదల జంటను పట్టి కాల్చి భస్మము చేయవలయును. వాటిని విడిగా కాల్చి ఆ భస్మమును విడి విడిగా భద్రపరచవలయును. ఒక భస్మమును మేక కొమ్మునకు కట్టి పరీక్షించవలయును. ఆ మేక సాంగత్యము కొరకు మరొక

మేక వద్దకు వెళ్ళితీరును. అపుడు ఆ భస్మమును ఏ స్త్రీ శిరసునందు చల్లెదమో వారు అనుకూలురై ఆకర్షితులగుదురు.

ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై గోరోచనముతో వ్రాసి తేనెయందుంచినచో దూరముగా నున్న వ్యక్తి ఆకర్షితుడగును.




## జయమంత్రములు

ఓం హూంఫట్ అను మంత్రము ఎదిరి వ్యక్తి ఉండగా 100 సార్లు జపించినచో జయము కలుగును.

మార్గశిర పూర్ణిమ రోజున మయూర శిఖమూలము సమంత్రకముగా తెచ్చి, భుజమునకు ధరించినచో కోర్టు వ్యవహారము లందు జయము కలుగును.

గిరికర్ణిక – జమ్మి – తెల్ల గురివింజ వీటిని చందనముతో నూరి తిలకముగా ధరించిన జయము కలుగును.

ఆర్ద్రా నక్షత్రము రోజున మర్రి బదనిక చేతికి ధరించిన జయము కలుగును.

## జయకర యంత్రములు

ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై గోరోచనముతో లిఖించి చేతికి ధరించిన జయము కలుగును.

| 53 |
| --- |
| **దేవదత్త** |




దీనినే మహా మహేశ్వరీ విద్య అందురు.

## సౌభాగ్యకరం

పుష్యమీ నక్షత్రము రోజున తెల్ల జిల్లేడు వేరు సమంత్రకముగా దెచ్చి కుడి భుజమునకు ధరించిన స్త్రీ, సౌభాగ్యముతో చిరకాలము వర్ధిల్లును.

ఈ క్రింది యంత్రము కుంకుమ పువ్వు- గోరోచనముతో లిఖించి తేనె యందుంచిన స్త్రీకి సౌభాగ్యకరముగా నుండును.




## కోపము తగ్గుటకు

"ఓంశాంతే ప్రశాంతే సర్వక్రుద్ధోపశమని స్వాహా" ఈ మంత్రమును 21 మార్లు జపించి ముఖము నీళ్ళతో కడుగు కొనిన ఎడల క్రోధము ఉపశమించును.

## స్తంభనం

తెల్ల గురివింజ వేరు ముఖమునందుంచుకొని ఈ క్రింది మంత్రము పఠించిన శతృ స్తంభనమగును.

ఓం హ్రీం రక్ష చాముండే తురుతురు అముకం మే వశమానయ స్వాహా ।

పుష్యార్క యోగమునందు మధు బదనిక తెచ్చి సభా మధ్యమున ఉంచిన ప్రతివాదులు మాట్లాడలేరు.

ఈ క్రింది యంత్రమును భూర్జపత్రిములై గోరోచనముతో లిఖించి భూమిలో పాతినచో శత్రుముఖ స్తంభనమగును.




ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై గోరోచనముతో లిఖించి ప్రాతః కాలమున ఈశాన్యము నందు పాతినచో శత్రుముఖ స్తంభనమగును.



## నిద్రా స్తంభన

బృహతీమూలము, మధుక మూలముతో నూరి నస్యముగా చేసి ముక్కుతో పీల్చిన నిద్ర రాదు ఇది మూలదేవుడు చెప్పిన ప్రక్రియ.

కృత్తికా నక్షత్రము రోజున వెలగబదనిక విధి యుక్తముగా గ్రహించి ముఖమందుంచుకొనిన ఖడ్గ (శాస్త్ర) స్తంభన సిద్ధించును.

పుష్యమి నక్షత్రము రోజున తెల్ల గురివింద వేరుగ్రహించి, చేతికి కంకణము వలె ధరించిన శస్త్ర భయము ఉండదు. కార్యసిద్ధికరము.

## అ్నగి స్తంభన

ఓం మత్కటిం తచ్చయ ధనేశే కీటయ మనీయ శ్రీ అలిప్య ప్రాయంబదీయే వశనరకౌర్య మంత్రీ క్రీం ఫట్॥

ఓం క్రీం మహిషవాహిని జంభయ జంభయ భేదయ భేదయ మోహయ మోహయ అగ్నిం స్తంభయ స్తంభయ ఠః ఠః॥

ఈ రెండు మంత్రములు అగ్ని స్తంభన కరములు 1 లక్ష జపించిన సిద్ధించును.

## జంతు స్తంభనం

**శ్లో॥ ఉష్ట్ర స్యాస్థి చతుర్ధిక్షు నిఖనేద్భూతలే ధృవం**
**గోవాజిమేషే మహిషీఃస్తంభయేత్కరిణీమపి॥**

ఒంటె ఎముకలను నాలుగుదిక్కులా భూమిలో పాతినచో ఆవు - గుర్రము - మేక - గేదెలు స్తంభనమగును. ఇది గజస్తంభన కూడా గావించును.

## మనుష్య స్తంభనం

ఓం కాలీ కరాళీ దేవదత్తం స్తంభయస్వాహా ఈ మంత్ర మందు సాధ్యనామము చేర్చి జపించి వారిని చూచిననూ, తాకిననూ వెంటనే స్తంభితులగుదురు.

ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై గోరోజన ముతో లిఖించి, పూర్వోక్త మంత్రమును జపించి, ఆ పత్రమును చేతితో ఊపి, సాధ్య వ్యక్తిని దర్శించిననూ, స్పృశించిననూ స్తంభన జరుగును.



## శత్రుబుద్ధి స్తంభనం

ఓం నమో భగవతే విశ్వామిత్రాయ నమః

సర్వ ముఖీభ్యాం విశ్వామిత్ర ఆజ్ఞాపయతి శక్త్యా ఆగచ్ఛ ఆగచ్ఛ స్వాహా ॥

ఈ మంత్రము 108 సార్లు జపించి – ఓం అంగులీలా త్రిధా ఆశయ ఆగల స్వాహా॥ అనుమంత్రముతో నదియందు ప్రవేశించి 108 సార్లు జలతర్పణము గావించిన మన మనసు నందున్న శత్రువు యొక్క బుద్ధి స్తంభనమగును.

కర్పూరముతో చితాంగారములపై శత్రునామము లిఖించి దానిపై మట్టి చల్లిన శత్రుముఖ స్తంభనమగును.

## గర్భస్తంభన

మాస శివరాత్రినాడు ఉమ్మెత్తవేరు సమంత్రకముగా గ్రహించి నడుముకు కట్టుకొని భార్యను రమించిన ఎడల గర్భము ఏర్పడదు. కటి సూత్రము ఉన్నంత వరకు స్తంభన జరుగును. ఇది ఆచార్య నాగార్జున సిద్ధ తంత్రము.

## శుక్రస్తంభన

నగ్నముగా పుష్యమీ నక్షత్రము రోజున ఇంద్ర వారుణి మూలము సమంత్రకముగా గ్రహించి, దానిని సొంఠి –

మిరియాలు – పిప్పళ్ళు కలిపి నూరి ఆవు పాలతో గుటిక వలె చేసి, నీడలో ఎండించి దానిని నోటియందుంచుకొని సంభోగము చేసినచో వీర్య స్థలనము జరుగదు.

పుష్యమీ నక్షత్రమునాడు గన్నేరు మూలము గ్రహించి నడుమునకు కట్టుకొని స్త్రీని రమించిన శుక్ర స్థలనము జరుగదు.

నల్ల ఉమ్మెత్త – మహాకాల చెట్లను శనివారమునాడు మంత్రించి, కన్యచేత మూడుపేటల దారము పేనించి, మూడు భాగములుగా కత్తిరించి వేరుకు చుట్టి ఎడమ చేయికి ధరించి, 3 జాములు ధ్యాన మందు కూర్చుని ఉన్నచో వీర్య స్తంభన శక్తి కలుగును. సూత్రము విప్పివేసినచో ఆ శక్తి పోవును.

ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై గోరోచన ముతో లిఖించి, నిర్జన ప్రదేశమునందు పాతినచో త్రిభువన స్తంభన మగును (?) (వివరము తెలియలేదు).



ఈ క్రిందియంత్రమును పసుపు మరియు హరితాళముచే భూర్జపత్రము నందు లిఖించి, నిర్జన ప్రదేశములో పాతినచో త్రిభువన స్తంభనమగును.




## మోహనం

శృంగి – వచ – వట్టివేళ్లు – రాలం (త్రుటి) – చిన్నయాల కులు ఇవి సమాన భాగములుగా గ్రహించి, చందనముతో నూరి, స్త్రీలు వీటిని వంటికి రాసుకొన్నచో ఎంతో పరిమళ భరితముగా నుండి జనులు మోహితులగుదురు.

హంసపది – ఉమ్మెత్త పూలు –లజ్జావంతి –గుంటకలగర వీటిని నీటిని నేతిలో కలిపి తిలకముగా ధరించిన త్రైలోక్య మోహనమగును.

ఈ క్రింది మంత్రముతో తాంబూలము తయారు చేసి సాధ్య వ్యక్తికి తినిపించినచో అతడు తనయందు మోహితుడగును.

**ఓం అం ఆం ఇం ఈం ఉం ఊం ఖుం హూం ఫట్ ॥**

## కేశములకు రంగు

మామిడి జీడి తైలము - కాంత పాషాణము - కాక తుండి ఫలము - లోహ చూర్ణము, బాగుగా నూరి ధాన్యరాశిలో 1 నెల ఉంచవలయును అనంతరము ఈ రంగును తలకు పట్టించిన 6 నెలల వరకు నల్లరంగుగా నుండునని కామరత్నం 5-63.

## పేలు నశించును

మారేడు వేరు, గోమూత్రముతో నూరి తలకు పట్టించినచో పేలు నశించును.

## పేనుకొరుకుడు

కుంకుమపువ్వు - నల్ల మిరియాలు - నిమ్మనూని వాటిని సమముగా నూరి, లేపము రాసినచో పేనుకొరుకుడు శీఘ్రముగా నశించును.

## వాజీకరణం

**శ్లో॥ బలేన నారీ పరితోషమేతి**
**నహీన వీర్యస్య కదాపి సౌఖ్యం ।**
**అతో బలార్ధం రతి లంపటస్య**
**వాజీ విధానం ప్రథమం విదధ్యే॥**

వీర్యబలము - అంగ దృఢత్వము చేతనే స్త్రీ బాగుగా సుఖమును పొందును. అల్ప బలము గలవారు స్త్రీని సంతృప్తి పరచలేరు. అటువంటి వారి కొరకు ఆయుర్వేదమునందు - తంత్ర శాస్త్రములందు వాజీకరణ ప్రక్రియలు చెప్పబడ్డాయి.

వాజీకరణమనగా - వాజి అంటే గుర్రము. ఈ గుర్రము శక్తికి ప్రతీక, అందుచేతనే ఎనర్జీని మోటారు శక్తిని ళళిజీరీలి ఆళిగీలిజీ లో కొలుస్తారు. ఆయుర్వేద మందలి వాజీకరణ ఔషధములలో పాదరసము శుద్ధి చేసి ఉపయోగిస్తారు. వీటిని 45 సం॥లు దాటిన వారే వాడితే మంచిదని కొందిరి వైద్యవేత్తల అభిప్రాయం.

తంత్ర శాస్త్రములో ప్రక్రియలు ఈ విధంగాయున్నాయి.

అశ్వనీ నక్షత్రమందు మర్రి బదనిక సమంత్రకముగా తెచ్చి పాలతో నూరి, నీటితో సేవించిన యవ్వనశక్తి లభించును. ఈ విధముగా 1 వారం సేవించవలయును. (వైద్యుల పర్యవేక్షణ అవసరం).

వంద సంవత్సరముల బూరుగుచెట్టు వేరు రసము పంచదారతో కలిపి 1 వారం సేవించిన రేతస్సు వృద్ధిచెందును.

చిన్న బూరుగవేరు - తాటి వేరు కలిపి చూర్ణము చేసి నేతితో కలిపి సేవించిన సంభోగ శక్తి పెరుగును.

నృసింహ చూర్ణం – మదన మోదకం – కమకలారసం ఇవి అనుభవజ్ఞులైన వైద్యుల సహాయముచే తయారు చేసుకొనవలయును. ఈ మందులలో పాదరస శుద్ధి సరిగా జరగనిచో బొల్లివంటి చర్మ వ్యాధులు వచ్చు అవకాశమున్నది. సరిగా శుద్ధికాని పాదరసము రక్తములో కలిసి చర్మములోని మెలనిన్ అను రంగు పదార్థమును హరించును.

## స్త్రీ సంగమకాలం

**శ్లో॥ త్రిభిస్త్రిభిరహోభిశ్చ సేవేత ప్రమదాంనరః**
**సర్వర్తుఘచ గ్రీష్మేషు పక్షాత్పక్షాద్వ్రజేద్ బుధః**

అన్ని ఋతువులలోను 3 రోజులకొకసారి స్త్రీ సంగమం మంచిది. గ్రీష్మ ఋతువునందు 15 రోజుల కొకసారి మాత్రమే స్త్రీతో కలవవలయును.

ఇందుకు వ్యతిరేకముగా స్త్రీ సంగమం చేసినవారికి, గ్లాని – దుర్బలత్వము – ధాతునష్టం అండవృద్ధి – అకాల మరణము వంటివి కలుగును.

## గాఢీకరణం

ప్రౌఢ వయసు వచ్చిన స్త్రీ (40 సం॥), ప్రసవించిన స్త్రీ, వీరి యొక్క అంగములు శైథిల్యమును పొందును. అందుచేతనే

"మరణాంతాని వైరాణి

ప్రసవాంతంచ యౌవనం" అన్నారు. మరణముతో శతృత్వము పోవును. ప్రసవము అయిన పిమ్మట స్త్రీ కి యౌవనము పోవును. అనగా బిగువు సడలును. ఇటువంటి వారికి అవయవములు దృఢముగా నుండుటకు చేసే ప్రక్రియలే "గాఢీకరణం".

రెండు రకముల పసుపు – కమలము – కేసరములు – దేవదారు ఇవి సమ భాగములుగా నూరి యోనికి లేపనము చేసినచో సంకోచము పొంది గాఢీకరణమగును.

కమలమును సమూలముగా పెకలించి పాలతో నూరి గుటిక కావించి, యోని యందు 1 నిమిషముంచినచో బిగువు పెరుగును.

## ద్రావణం

స్త్రీలకు మద ద్రావణము బాగుగా కలిగిన వారికి సుఖమైన భావప్రాప్తికి వీలగును. ఈ క్రింది మంత్రము 108 సార్లు జపించిన సిద్ధించును.

**'ఓం నమో భగవతే రుద్రాయ ఉడ్డామరేశ్వరాయ ద్రావయ ద్రావయ స్త్రీణాం మదం పాతయ పాతయ స్వాహా ఠః ఠః ॥**

## లింగస్థూలీకరణం

నల్ల పారిజాత మూలము, చంద్రకీలకం గ్రహించి నడుముకు ధరించిన లింగము స్థూలమగును.

## లోమ శాతనం

హరతాళం–శంఖచూర్ణం – ఉప్ప నీటితో నూరి లేపనము చేసి–ఎండ తగిలించిన కేశములు రాలిపోవును. తిరిగి మొలకెత్తవు.

నల్ల చీమల పుట్ట మట్టి తెచ్చి, నీడలో ఎండించి చూర్ణము గావించి, దానిని 5 రోజులు రోమములకు పూసినచో చూర్ణము రాలిన కేశములు తిరిగి మొలకెత్తవు'.

గర్భపాతమునకు కొన్ని ప్రయోగములు చెప్పబడ్డాయి.

## వంధ్యాదోష నివారణ

ఒక రుద్రాక్ష – ఒక వర్షమెత్తు సర్వాక్షి ఆవుపాలతోనూరి ఋతుకాల మందు 7 రోజులు వంధ్యా స్త్రీకి ఇచ్చినచో సంతానవతి అగును. ఈ క్రింది మంత్రముతో గణపతి రక్ష కావించవలయును.

**ఓం దదన్మహాగణపతే రక్షామృతం మత్సుతం దేహి॥**

ఈ క్రింది యంత్రమును భూర్జపత్రముపై గోరోచనం – కుంకుమ పువ్వు మిశ్రమంతో లిఖించి కంఠమందు ధరించినచో మహారక్ష కలుగును. ఇది మహా గణపతి విద్య.




సర్పాక్షి వేరును ఆకులతో సహా ఆదివారమునాడు పెకలించి, ఒకే రంగు కలిగిన ఆవు పాలతో కన్యచేత నూరించి వంధ్యా స్త్రీకి ఋతు కాలమందు కొద్ది కొద్దిగా తినిపించ వలయును. ఇది సేవించు కాలమున పాలు, అన్నం, పెసరపప్పు మాత్రమే ఆహారముగా స్వీకరించాలి. ఈ విధముగా 7 రోజులు ఆచరించాలి. ఉద్వేగము భయశోకములు, పగటి నిద్ర వర్జించాలి.

పుష్యార్క యోగమునందు సహదేవి సమూలముగా గ్రహించి, నీడలో ఎండించి ఆ చూర్ణమును, శరీరమంతా ఒకే రంగు గల ఆవుపాలతో సేవించిన పుత్రవంతురాలగును.

లక్ష్మణ మూలిక, జటామాంసె ఆకులు చూర్ణము కావించి, ఋతు కాలమునందు పాలతో 3 దినములు సేవించిన పుత్రవతి అగును. ముందు చెప్పినట్లు లఘు ఆహారము సేవించాలి. ఇది చాలా ఆశ్చర్య కరముగా అనుభవములోనికి వచ్చును. పూర్వ కాలము ఎంత కాలమునకూ సంతానము కలుగని వారు, లక్ష్మణ మూలిక సేవించి పుత్రవంతులై తమ కుమారులకు లక్ష్మణ పేరు పెట్టినట్లు పూర్వ పరంపరగా వచ్చిన మా గురుదేవులు చెప్పియున్నారు.

పుష్యార్క యోగమున సమంత్రముగా లక్ష్మణ మూలిక తెచ్చి చూర్ణము కావించి నేతితో సేవించి, పాలు త్రాగిన అవశ్యము గర్భము కలుగును. ఇది అనుభవ సిద్ధ ప్రయోగం.

అశ్వినీ నక్షత్రమందు రావి బదనిక తెచ్చి ఆవుపాలతో నూరి, సేవించిన వంధ్యా స్త్రీ పుత్రవతి అగును.

## బాలరక్ష

మారేడు మూలం –దేవదారు – గోశృంగం – ప్రియాంగు –పిల్లిమలం–కంకుష్ఠం –ఎదురు పట్ట ఇవన్నీ గజ మూత్రముతో నూరి, నీడను ఎండించి, ధూపము వేసినచో గ్రహ– భూత –జ్వరములు తొలగి బాలకునకు రక్షగా నుండును.

ధూపము వేయునపుడు ఓం ద్రావితం తాపే ఠం ఠః స్వాహా – అను మంత్రము పఠించాలి.

## కలహాకరణం

పిల్లి – ఎలుక – బ్రాహ్మణుడు – దిగంబరుడు వీరి కేశములు గ్రహించి, ఆర్ద్రా నక్షత్రము రోజున గృహములో ధూపము వేసిన ఎడల, ఆ ఇంటిలోని వారందూ పరస్పరము కలహించుకొందురు.

విశాఖా నక్షత్రము రోజున వేప చెట్టు యొక్క ఉత్తర దిశగా పారిన వేరు నగ్నముగా గ్రహించి దానిని ఎవరి ఇంటిలో వేయుదుమో వారు సతతము కలహించుకొందురు.

## సర్వారిష్ట నాశక రక్షవిధి

ఈ క్రింది మంత్రమును రోజూ 50 సార్లు జపించిన సకల అరిష్టములు–నరఘోష తొలగి ఇంటి యందు శాంతమైన వాతావరణము ఏర్పడును. ఇది నిశ్చయము, అనుభవసిద్ధం.

ఓం హ్రీం హ్రీం హ్రీం ఓ హ్రీం క్రీం ఖ్రీం క్ష్రీం ఓం ఠ్రీం ధ్రీం ఫ్రీం హ్రీం

ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై గోరోచన ముతో లిఖించి గృహమందు దేవతా మందిరమున ఉంచినచో గృహమునందు అరిష్టములు – నరఘోష తొలగును.

| ఓం | హ్రాం | ఓం |
|---|---|---|
| ఓం | హ్రాం | ఓం |
| ఓం | హ్రాం | ఓం |

పుష్యార్క యోగమున తెల్ల జిల్లేడు సమంత్రకముగా తెచ్చి, చేతికి గాని మెడలోగాని ధరించిన శారీరిక బాధలు – మానసిక బాధలు ఏర్పడవు.

శ్రవణం నక్షత్ర జాతకులు తెల్ల జిల్లేడు వేరు పెకలించ రాదు. ఇది వారికి జన్మ నక్షత్ర వృక్షము కావున వారు దీనిని ఛేదించరాదు. భక్తిగా అచ్చటనే పూజ చేయవలయును.

## నిద్రాకరణం

ఈ క్రింది మంత్రమున పరుండబోవునపుడు మనసులో జపించిన మంచి నిద్ర కలుగును ఇది అనుభవ సిద్ధయోగము.

ఓం హ్రీం చం డాం డ ఉగ్ర చండారికా కాళికా నిద్రయ నిద్రయ.

కాక జంఘా – రుద్రజట వేరులు శిరస్సుపై నుంచుకొనిన నిద్రవచ్చును.

ఈ క్రింది మంత్రమును, శ్మశానము నందు గో మూత్రముతో కలిసిన మట్టిని తెచ్చి ఇంటిలో వేసి 300 మార్లు జపించిన నిద్రాసిద్ధి కలుగును.

ఓం శుద్ధే శుద్ధే మహాయోగిని మహానిద్రే స్వాహా ॥

## నిద్రానాశనం

గుమ్మడి – గెదెకొమ్ము సమభాగములుగా నూరి వీపుపై కుడి భాగమున లేపనముగా రాసినచో నిద్రాక్షయమగును.

## బంధమోచనం

మార్గ శిర పున్నమి యందు శిఖిమూలము తెచ్చి, శిఖపై ధరించిన బంధనములు తొలగును.

## ఉచ్ఛాటనం

మంగళవారమునాడు రాత్రి శ్మశానాంగారములు తెచ్చి నల్లవస్త్రములో పెట్టి, ఎర్రదారముతో కట్టి ఎవరి ఇంటిపై వేయుదమో వారు వారంరోజులలో ఇల్లు వదలివెళ్ళి పోయెదరు.

ఈ క్రింది మంత్రమును 1008 సార్లు జపించి, 5 అంగుళముల చిత్రక కొమ్ము పునర్వసు నక్షత్రమునందు తెచ్చి, ఎవరి ఇంటియందు పాతెదమో వారికి ఉచ్చాటన జరుగును.

**మంత్రము – ఓం లోహితముగే స్వాహా ।**

శ్మశానాంగారముతో శ్మశాన వస్త్రముపై ఈ క్రింది యంత్రమును వ్రాసి, శతృస్థానమందుంచిన ఒక్క రాత్రిలో ఉచ్చాటన మగును.




కాకి - గుడ్లగూబ ఈకలు 108 తెచ్చి ఎవరి గోత్రనామములతో ఈ క్రింది మంత్రముతో హోమము చేతుమో వారికి అవశ్యము ఉచ్చాటనమగును.

ఓం నమో భగవతే రుద్రాయ దంష్ట్రా కరాలాయ అముకం సపుత్ర బాంధవైస్సహాహన హన దహ దహ పచపచ శీఘ్రం ఉచ్చాట య ఉచ్చాటయ హుంఫట్ స్వాహా ఠః ఠః॥

ఈ క్రింది యంత్రమును సాధ్యనామముతో విషము - ఉమ్మెత్త- లవణము - నిమ్మ నీటితో శ్మశాన వస్త్రముపై లిఖించి,

శ్మశానమునందు పాతినచో ఆ వ్యక్తికి శీఘ్రమే ఉచ్చాట నమగును.

ఓంతారే ఓంతారే తురే
చలచల శీఘ్రగామినీ
అముక ముచ్చాటయ ఉచ్చాటయ స్వాహా

మాస శివరాత్రినాడుగాని, బహుళాష్టమి యందుగాని, శివనిర్మాల్యము, శవముపై కప్పిన వస్త్రము తెచ్చి ఎవరి ఇంటి యందో పాతెదవో వారికి ఉచ్చాటనమగును. మంత్ర ప్రయోగము లేకనే సిద్ధించు తంత్రమిది.

తెల్లావాలు – శివ నిర్మాల్యము ఎవరి ఇంటిలో పాతెదవో వారికి ఉచ్చాటనమగును వెలికి తీసిన సౌఖ్యము కలుగును.

ఈ క్రింది యంత్రమును రక్తముతో ధ్వజపీఠముపై వ్రాసి, కాకి మెడకు చుట్టి వదిలినచో ఉచ్చాటనమగును.

| దేవదత్త | |
|---|---|
| యః | యః |
| యః | యః |

ఈ క్రింది యంత్రమును భూర్జ పత్రముపై జిల్లేడు ఆకు రసముతో లిఖించి తేనెయందు ఉంచినచో ఆ వ్యక్తికి ఉచ్చాటన మగును.




చెట్టుపై నున్న కాకిగూడు తెచ్చి దానిని చితాగ్నిలో భస్మము చేసి, శతృవు శిరసుపై చల్లిచనచో శీఘ్రమే ఉచ్చాటనమగును.

## విద్వేషణం

తాళపత్రముపై శతృనామము, కర్మ లిఖించి దానికి ప్రాణ ప్రతిష్ఠ గావించి ఈ క్రింది మంత్రమును 3000 జపించి, దానికి విషము రాసి 2 ముక్కలు చేసి సముద్ర తీరమునందు భూమిలో పాతినచో శివ పార్వతుల వంటి వారికి కూడా విద్వేషణ కలుగును.

**మంత్రము - ఓం దేవదత్త యజ్ఞదత్త యోస్తు స్వాహా॥**

పిల్లి – ఎలుకల మలము తెచ్చి బొమ్మ చేసి, నీల వస్త్రము చుట్టి ఈ క్రింది మంత్రముతో 100 సార్లు మంత్రించిన తండ్రీ కొడుకులకైనా, సోదరులకైనా విద్వేషణ కలుగును.

మంత్రము – ఓం నమో మహాభైరవాయ చ శ్మశాన వాసిన్యై అముకాముకయోః విద్వేషం కురుకురు క్రణం ఫట్"

## శత్రుభ్రామణం

అశ్వినీ నక్షత్రము రోజున రావి కొమ్మ పది అంగుళములు తెచ్చి, ఎవరి ఇంటి ఆవరణలో పాతెదమో వారు దేశములు పట్టి తిరిగెదరు. ఇందు సందేహము లేదు.

నక్క ఎముక నాలుగంగుళములు తెచ్చి శతృగృహమున మృగశిరా నక్షత్రమున పాతినచో భ్రామణమగును.

## ఉన్మత్తీ కరణం

ఉమ్మెత్త రసము కాకి రసము కలిపి ఉమ్మెత్త ఆకుపై ఈ క్రింది యంత్రము లిఖించి వేప చెట్టు క్రింద వాయవ్య దిశలో ధరించినచో శత్రువు పిచ్చివాడగును.




మారణ ప్రయోగములు వ్రాయుట లేదు.

## సర్వసిద్ధి యంత్రం

ఈ క్రింది యంత్రమును కుంకుమ పువ్వుతో భూర్జన పత్రముపై లిఖించి, కుడి భుజమునకు ధరించిన సర్వకార్య సిద్ధి కలుగును. ఇందు సందేహము లేదు.

| ఈశాన్యం | తూర్పు | | ఆగ్నేయం |
|---|---|---|---|
| | అంఅః<br>లంక్షః | అ ఆ క ఇ ఈ<br>ఖ గ ఘ జ చ ఛ జ ఘ ఞ | |
| | ఓం ఔం<br>శ ష స హ భ | ఋ ౠ<br>త థ ద ధ న | |
| | ఎ ఐ<br>య ర ల వ | ప ఫ బ భ మ ట ఠ డ ఢ ణ | |
| వాయువ్యం | పడమర | | నైఋతి |

## వాక్సిద్ధి

కృత్తికా నక్షత్రము నాడు బ్రహ్మ జెముడు బదనిక చేతికి ధరించిన పలికిన పలుకు యధార్ధమగును. ఇది మహాశ్చర్యకర మైన తంత్రము. ఈ క్రింది మంత్రముతో బదనిక గ్రహించ వలయును.

ఓం అంతరిక్షాయ స్వాహా

## గుప్త నిధుల అన్వేషణ

శాఖోట వృక్షము యొక్క బదనిక, మామిడి బదనిక, గోక్షురం, నాలగవ వంతు లవణము వీటిని మేక పాలతో నూరి, నుదుటిపై తిలకముగా ధరించిన గుప్త నిధులు గోచరమగును. సంశయము లేదు.

శనివారం ఆశ్లేషా నక్షత్రము రోజున సాయం కాలము దానిమ్మ గింజల రసము గ్రహించి అష్టమీ మంగళవారము, తామర పూవు వేర్లు పిల్ల పీచర రసము గ్రహించి, పరిశుద్ధి చేసి అంజనము తయారు చేయవలయును. దీనిని శుభ దినమున శుక్రవారమునాడు కాటుకవలె ధరించిన గుప్త నిధులు, దొంగతనముగా పాతిన వస్తువులు కనబడును.

## ధనధాన్య అక్షయం

మఖానక్షత్రము రోజున బహువార వృక్షము యొక్క బదనిక గ్రహించి ధనముండు బీరువాలో శుక్రవారమునాడు ఉంచిన ధనమునకు లోటు లేకుండా నిండుగా ఉండును.

హస్తా నక్షత్రము రోజున శేఫాలికా బదనిక సమంత్రక ముగా గ్రహించి, శుభ దినమున ధ్యాన్యాగారము నందుంచిన అక్షయముగా నుండును.

రోహిణీ నక్షత్రమున మేడి బదనిక సమంత్రకముగా తెచ్చి ధనస్థానమున ఉంచిన ఎల్లప్పుడూ సంపదలతో నుండును.

## బాహ్మీఘృతం

వచ–సరస్వతి ఆకు, కుష్ఠం, సైంధవ లవణం – నువ్వు పూలు, రక్త చందనంతో నూరి, మరల మండూక పర్ణి, బ్రాహ్మీ రసముతో రెండుసార్లు నూరి ఒక దినము వండి దీనికి 4

రెట్లు నేయి వేసి దీనికి 4 రెట్లు ఆవుపాలు పోసి తిరిగి సరస్వతి రసం ఆకు వేసి వడకొట్టిన అపుడు రసముపోగా నేయి వంటిది మిగులును. దీనినే బ్రాహ్మీఘృత మందురు. ఇది బుద్ధిని పెంచి జ్ఞాపక శక్తి పెరుగును అనుభవజ్ఞులైన వైద్యుల పర్యవేక్షణలో దీనిని తయారు చేయవలయును.

## కిన్నరస్వరం

పసుపు – వచ – కుష్ఠం – పిప్పలి – నల్ల మిరియాలు యవనిక – సౌంధవలవణం – శొంఠి వీటిని చూర్ణము చేసి, మరల తేనె నూరి దానిని 7 రోజులు తగు మాత్రముగా సేవించిన స్వరము చక్కబడును.

## చక్షుష్యం

వర్ష ఋతువునందు కాక మాచిని సమూలముగా గ్రహించి నువ్వుల నూనెతో వండి 1 నెల తగుమోతాదు సేవించిన గ్రద్ద వంటి తీక్ష దృష్టి కలుగును.

**శ్లో॥ ఘృతేనపుష్పం మధునాశృపాతం**
**తైలేనకండూం తిమిరం జలేన ।**
**రాత్ర్యంధకం కాంజికయాని హంతి**
**పునర్నవా నేత్ర పునర్నవంకరీ ॥**

**తా॥** పునర్నవ రసము నేతితో కలిపి కనులకు కాటుక వలె ధరించిన కంటిలోని పువ్వులు నివారణమగును తేనెతో కలిపి ఉపయోగించిన కంటినుండి నీరు కారడం తగ్గుతుంది. నూనెతో దురదలు, నీటితో చీకటి దృష్టిమాంద్యం, గంజితో రేచీకటి వ్యాధులు నశించును. తెల్లపునర్నవ ఉపయోగిస్తే మరీ మంచిది.

## కర్షపాలీ వర్ధనం

తెల్లావాలు – ములగ – ఉత్తరేణి సమాన భాగములుగా గ్రహించి చూర్ణము కావించి మేకపాలతో లేపనము గావించి పూసినచో కర్ణపాలి వృద్ధి పొందును. (చెవి తమ్మె)

## దంతదృఢీకరణం

చింత – జయంతి – వీటితో దంత ధావనము చేయు చుండిన దంతములు గట్టిబడును.

బ్రహ్మ చెముడు వేరు పుచ్చి పన్ను వద్ద ఉంచిన బాధ నివారించును. రసము మింగరాదు. వకుళ గింజలు బాగా నమిలి ఉమిసినచో కదిలే పళ్ళు దృఢమగును.

## ఆహారకరణం

జిల్లేడు పీటపై కూర్చొని భోజనం చేసినచో ఆహారము అతిగా సేవించును.

తొండయొక్క క్రింద పెదవిని, శిఖా స్థానమున ధరించి ఆహారము తినినచో, భీమునివలె అతిగా తినును. ఈ క్రింది మంత్రము ముందుగా సిద్ధి పొందవలయును.

ఓం నాభివేగేన ఊర్వశీ స్వాహా॥

## అనాహారకరణం

కమలబీజములు – శాల్యన్నం వీటిని మేక పాలతో వండి నేతితో భుజించిన ఎడల ఆకలి వేయదు.

ముందుగా ఈ క్రింది మంత్రమును సిద్ధింప చేసుకోవాలి.

**'ఓం నమో భగవతే రుద్రాయ అమృతార్క మధ్యే సంస్థితాయ మమశరీరే అమృతం కురుకురు సఃస్వాహా॥**

## పాదుకాసాధనం

గుర్రపు డెక్క (అశ్వనాలం) – అంగులీతైలం – తెల్ల ఆవాలతో నూరి, అరికాళ్లకు రాసుకొని నడక సాగించిన ఎంత దూరమైనా అనాయాసముగా నడవగలడు.

అంకోల వేరును (ఊడుగవేరు), నువ్వుల నూనెతో వండి, అరికాలి నుండి మోకాలు వరకు లేపనము కావించుకొని గమనము సాగించుకొనిన ఎంత దూరమైన అనాయాసముగా నడువగలడు.

వీటికి (1) ఓం హ్రీం నమః

(2) ఓం నమశ్చండికాయై గగనం

గగనం చాలయ చాలయ వేశయ హిలి హిలి వేగవాహినీ హ్రీం హ్రీం స్వాహా।

పై రెండు తంత్రములకు ఈ రెండు మంత్రములు సిద్ధించ వలయును.

## మేఘస్తంభన

రెండు ఇటికలను దగ్గరగా సంపుటి చేసి శ్మశానాంగా రములతో ఈ క్రింది యంత్రమును లిఖించి పాతినచో, మేఘ స్తంభన జరిగి వర్షములు కురియవు.




## వర్షము కురియుటకు

జలమధ్యమున నిలబడి ఈ క్రింది మంత్రమును సామూహికముగా 33 మంది జపించిన వర్షము కురియును. ముందుగా రుద్రాభిషేకము చేయవలయును.

'హుం శ్రీం హుం'

## అంజన విద్య

అంజన సాధనలో ముందుగా అఘోర మంత్ర సిద్ధిని పొందవలయును. అనంతరం

ధ్యానం - బహురూపం విశ్వరూపం విద్యాధర మహేశ్వరం।

జపామ్యహం మహాదేవం సర్వసిద్ధి ప్రదాయకం॥

ఇంద్రియ నిగ్రహముతో, ఉపవాసముండి ఈ క్రింది శివ మంత్రమును జపించవలయును.

ఓం నమో రుద్రాయ రుద్రరూపాయ

నమో బహురూపాయ నమో విశ్వరూపాయ నమో విశ్వాత్మనే నమః తత్పురుషయక్షాయ నమో యక్ష రూపాయ నమ ఏక యక్షాయ నమ ఏకేక్షణాయ నమో యక్షాయ నమో వరదాయ నమః తుద తుద స్వాహా॥

అంజనము తయారు చేయుటకు శ్మశానాగ్నిని తీసుకొనివచ్చి

ఓం జ్వలిత విద్యుద్ధూమాయ స్వాహా అని సమంత్రకముగా ఉంచి

ఓం నమో భగవతే వాసు దేవాయ ధర ధర బంధ బంధ శ్రీ పతయే స్వాహా - అను మంత్రముచే, వత్తిని అభిమంత్రించి

ఓం నమో భగవతే సిద్ధ సాధకాయ జ్వల జ్వల పచ పచ పాతయ పాతయ బంధ బంధ సంహర సంహర దర్శయ దర్శయ నిధిం నమః

అని దీపమును వెలిగించవలయును.

ఓం ఐం మంత్రః సర్వ సిద్ధేభ్యోనమః విశ్వేభ్యః స్వాహా। అను మంత్రముతో కాటుకను గ్రహించవలయును.

ఓం కాళి కాళి మహాకాళి రక్షదం అజనం నమో విశ్వేభ్యః స్వాహా - అని అంజన ద్రవ్యమును అభిమంత్రించి

ఓం సర్వే సర్వహితే క్లీం సర్వే సర్వహితే సర్వోషధ ప్రియా హితే విరతే నమోనమః స్వాహా

అను మంత్రముతో బంగారు శలాకతో నేత్రములకు అంజనము వలె ధరించ వలయును. అనంతరం మెల్లని వస్త్రము పట్టీ వలె కళ్ళకు కట్టవలయును. పట్టు వస్త్రమును కూడా కట్టవచ్చును.

ఈ అంజనము అధికాంగములు కలవారికి అనగా చేతికి గాని, కాలికి గాని ఆరు వేళ్ళు ఉన్నవారికి మరియు అంగహీనులకు, కుక్క కరచినవారికి, అగ్నితో శరీరము కొంత కాలిన వారికి ధరింపచేయరాదు.

శుచిగా 2 రోజులు పగలు ఉపవాస ముండి రాత్రి భోజనము శివపూజానంతరము చేసి (పాలు – అన్నము మాత్రమే) మరల అంజనము ధరింప చేయవలయును.

యక్ష ప్రతిమ చేసి ఉదయం – సాయంత్రం ఈ క్రింది మంత్రముతో శిఖాబంధము గావింప వలయును.

ఓం నమో భగవతే రుద్రాయ తుల తుల మహేశ్వర మాహేశ్వర నుజ్వల నుజ్వల విజ్వల విజ్వల మిజ్వల మిజ్వల హరహర యక్ష రాజపూజితే యక్ష కుమారి సులోచనేస్వాహా – ఓం నమో భగవతే రుద్రాయ ఓం నన్న నన్న మహోన్న విహేన్న విహేన్న మహేన్న – మహేన్న విహేన్న విహోన్న మహోన్నే హరహర రక్ష రక్ష పూజితే యక్ష కుమారి సులోచనే స్వాహా ।

ఉత్తరాయణమందు ఇంద్రగోప పురుగలనుగ్రహించి సిందూరముతో కలిపి, జిల్లేడు దూదితో వత్తి చేసి, నల్లని నువ్వుల నూనితో కలిపి దీపము వెలిగించి కాటుక గ్రహించవలయును. పూర్వోక్త మంత్రములతో అంజనము ధరించి చూసిన ఇష్ట దర్శనమగును.

## మరియొక ప్రయోగం

అనూరాధ నక్షత్రము రోజున శాఖోటవృక్షము యొక్క బదనిక సమంత్రకముగా గ్రహించి, గోరోచనముతో నూరి అంజనము చేసి ధరించిన నిధి దర్శనమగును.

## మృత సంజీవని

అంకోల వృక్షము క్రింద శివలింగమును ప్రతిష్ఠించి పూజించాలి. కొత్త కుండను అచట స్థాపించి కలశపూజ గావించి ఒకే సూత్రముతో వృక్షమును, లింగమును, కుండను కలిపి కట్టాలి.

అఘోర మంత్రముతో 4 గురు ఋత్విక్కులతో ప్రతీనిత్యం అర్చించాలి.

షోడశోపచార పూజ కావించాలి. అంకోల వృక్షము పూవులు పూసి, కాసి, ఫలములయ్యే వరకు అర్చన కొన సాగించాలి. అవన్నీ ఘటమునకు సమర్పించాలి. ఆ ఫలములు తోనే ఘటము నింపి పూర్ణం చేయాలి. అనంతరం వాటి బీజములు ఘటములో నుండి కుమ్మరి చేతి నుంచి మట్టి తెచ్చి దానిని నింపి, మరికొంత ఘటమునకు పూయాలి.

అనంతరం అవి ఆరిన తరువాత ఆ ఘటమును తిరగ వేసి అధోముఖముగా ఒక రాగి ఘటమందుంచి తైలమును గ్రహించాలి.

15 రోజులు అంకోల తైలము, 15 రోజులు తిల తైలము ఈ విధముగా గ్రహించి, మృతుని ముక్కులో ఆ తైలము వేసిన జీవితుడగును.

కొన్ని విషముల విరుగుళ్లు, యక్షిణుల సాధనలు – లోహ శుద్ధులు చెప్పబడ్డాయి.

'యంత్రము" గూర్చి దేవ భాగవతములో ఇట్లున్నది. "అర్చాభావే తధా యంత్రం - 3-26-21. అనగా పూజించు టకు ప్రతిమ లేనపుడు దాని ప్రతిరూపముగా యంత్రమును అర్చించవచ్చు అని అర్ధము.

మేరు తంత్రమందు-నారదీయ పురాణమునందు భగవంతుని స్థానములు 7 గా చెప్పబడ్డాయి.

**శ్లో॥ ఆపోగ్నిర్హృదయం చక్రం విష్ణోఃక్షేత్ర సముద్భవం**
**యంత్రం చప్రతి మా స్థాన మర్చనే సర్వదాహరేః**

1. జలము, 2. అగ్ని, 3. హృదయము, 4. చక్రము, 5. క్షేత్రము, 6. యంత్రము, 7. ప్రతిమ.

కాలాంతరమున మంత్ర పూర్వక యంత్రము ప్రతిమా ప్రతిష్ఠాపనాదులతో విశేష ఫల ప్రదమని ఋషులు గుర్తించారు. మానవుల శారీరక మానసిక బాధలకు యంత్రధారణ సహ కరించి బాధా నివృత్తి కలుగుతుందని అనేక బీజాక్షరములతో సంఖ్యలతో యంత్రములు సృష్టించారు.

ఇతర దేశములలో కూడా యంత్రములను తావీదులను ధరించడం వల్ల ఇష్టసిద్ధి కలుగుతుందని విశ్వసించేవారు.

యంత్రమును లేక తావీదును ఇంగ్లీషులో Amulet అంటారు. ఇది లాటన్ భాషా పదమైన ఏములేటం నుంచి వచ్చింది. చరిత్ర కారుడయిన ప్లయినీ వ్రాతలననుసరించి ఏమ్యులేటం పదము సైక్లేమన్ అనే ఒక ఔషధ మొక్కపేరు. ఈ మొక్కను ఇంటికి ద్వారమునకు కట్టినచో విష వాయువుల ప్రభావము నుచి కాపాడునని వారు విశ్వసించే వారు. క్రమేణా రోమనుల ఈ విశ్వాసము వివిధ సమస్యలకు, రోగములకు తాంత్రిక ప్రయోగములు కనిపెట్టుటకు దారి తీసినది.

యంత్రములు సిద్ధించాలంటే వాటికి నిర్ధిష్టములైన బీజాక్షరముల జపములతో మానసిక శక్తిని పొంది దానిని యంత్రమునందు నిక్షిప్తము చేసి, దాని ధారణ స్థాపనాదుల వలన అభీష్ట సిద్ధి పొందవచ్చు.

యంత్రములు స్థూలముగా 2 రకములు

1. మేరు ప్రస్తారము – ఇది రేఖాత్మకముగా ఉండక కోణం – వృత్తం – చతురస్రం వంటివి త్రీ డైమన్షనల్‌లో రూపము పొంది యుంటుంది. ఇవి పూజకు ఉపయోగిస్తారు.

2. భూ ప్రస్తారము – ఇది కేవలం పొడవు – వెడల్పులు మాత్రమే కలిగి రేకులపై కోణం – వృత్తం మొదలగునవి కలిగి యుంటుంది. ఎత్తు ఉండదు. ఇవి ఎక్కువగా స్థాపనకు, ధారణకు ఉపయోగిస్తారు.

మానవుని శశీర నిర్మాణము ముఖ్యముగా పృధివ్యప్తేజో వాయు రాకాశములు అనే పంచభూతములతో ఏర్పడినది. మనభూమి కూడా పృధివీతత్వము కలదై ఇతర మహాభూతముల సహాయముతో మనము జీవించుచున్నాము. యంత్రముల సహాయముతో మనము జీవించుచున్నాము. యంత్రములో లిఖించు రేఖలు-కోణములు-వృత్తములు మొదలగు వాటికి పంచభూత మహాతత్త్వములను అను సంధానించి-అకారాది క్షకారాంత వర్ణములలో పంచభూతముల తత్త్వములను నిర్దేశించి వాటిని యంత్ర సాధనలో ఎలా ప్రయోగించాలో మనకు పూర్వులు తెలియజేశారు.

| తత్త్వము | రేఖలు | అక్షరములు |
|---|---|---|
| పృధివి | చతురస్రం | ఉ-ఊ-ఓ-గ-జ-డ-ద-బ-ల |
| జలము | వృత్తము | ఘ-ఝ-ద-ధ-భ-వ-స |
| అగ్ని | త్రికోణము | ఇ-ఈ-ఐ-ఖ-ఛ-ఠ-థ-ఫ-ర |
| వాయువు | 3 వృత్తములు | అ-ఆ-ఏ-క-చ-ట-త-ప-య-ష |
| ఆకాశము | బందువు | అం-అః-ఙ-ఞ-ణ-న-మ-శ-హ |

యంత్రములో లిఖించు సంఖ్యలకు అదిష్ఠాన దేవతలు ఈ విధముగా నుందురు.

| సంఖ్య | దేవత | దిశ |
|---|---|---|
| 1. | రవి | తూర్పు |
| 2. | భువనేశ్వరి | నైఋతి |
| 3. | గణపతి | ఉత్తర |
| 4. | హనుమ | వాయవ్యం |
| 5. | విష్ణువు | పడమర |
| 6. | కుమారస్వామి | ఆగ్నేయ |
| 7. | కాళి | దక్షిణ |
| 8. | భైరవుడు | ఈశాన్యం |
| 9. | భైరవి | పడమర |

యంత్ర లేఖనమునకు ముందుగా బంగారు రేకు శ్రేష్ఠము – అనంతరము వెండి – రాగి ప్రశస్తములు. భూర్జ పత్రము కూడా మంచిదే కాని ఇది తాత్కాలిక ప్రయోజనములకే ఎక్కువగా ఉపయోగింతురు. త్రిలోహములు పంచలోహములతో రేకు తయారు చేసిన అది మరింత శ్రేష్ఠము.

## త్రిలోహ ఉంగర మహిమ

ఆదివారం – పుష్యమీ నక్షత్రం వచ్చినచో దానిని పుష్కార్య యోగమంటారు. ఇది విశిష్టమైన ఖగోళ శాస్త్ర శుభదినము. పుష్యార్క యోగమును పవిత్రముగా ఈ ఉంగరమును త్రిలోహములతో తయారు చేయాలి. లోహములు నిర్దిష్ట పరిమాణములో ఇలా ఉండాలి.

10 :12 :16 పాళ్లలో బంగారము : వెండి : రాగి ఉండాలి. ఇది దరిద్రమును నాశనము చేయుటలో వజ్రాయుధము వంటిది.

## యంత్ర లేఖినులు

వివిధ కోరికల సిద్ధికి యంత్రములు వ్రాయునపుడు రక రకముల లేఖినులు ఉపయోగించబడతాయి. లోహములలో బంగారు శలాక – వెండి – రాగి మరియు ఇతర ధాతువులతో చేసిన లేఖినులు ఉపయోగించ బడతాయి. అదే విధముగా మొక్కల కాడలు కూడా –జాజి – మల్లి –వేప – మావిడి – రావి – మర్రి పుల్లలూ – ఇంకా వివిధ పక్షి ఈకలు – ఇతరములై ముళ్లూ కూడా కార్య భేదమననుసరించి ఉపయోగపడతాయి.

## యంత్రసిద్ధికి మూలము

యంత్రముల వల్ల కార్యసిద్ధి పొందాలంటే క్రింద పేర్కొన్న విధులు తప్పనిసరి.

1. సాధకుడు తప్పని సరిగా పంచాక్షరి అక్షర లక్షలు జపం చేసి సిద్ధిపొంది యుండాలి. శివానుగ్రహం ఉండాలి.
2. యంత్ర గాయత్రి లేదా భూతలిపి సిద్ధి పొందియుండాలి.
3. నైతిక జీవనం పవిత్రంగా యుండాలి.

4. ఉపకార స్వభావము – వాక్ శుద్ధి ఉండాలి.

5. పరాన్న భోజనము – పరద్రవ్యము ఉచితముగా గ్రహించుట పరద్రోహచింతన–పరగృహవాసము–దానములు పుచ్చు కొనుట–తద్దినము భోజనములు చేయుట చేయరాదు.

## పంచదశీ యంత్రము

ఇది సంఖ్యా యంత్రములలో అమోఘమైనది. ఏ ప్రక్క నుంచి కలిపిననూ మొత్తం సంఖ్య 15 వచ్చును. పంచదశీ యంత్రము శ్రీ విద్యా మహామంత్రమునకు ప్రతిరూపము.

నవగ్రహ సూచకములైన 9 సంఖ్యలతో శివ శక్తి స్వరూపము ప్రతిఫలించునట్లుగా కేవలం శ్రేయోదాయికము కొరకే ఈ యంత్రము తయారు చేయబడినది. ఈ యంత్రముతో దుష్ట కర్మలు చేయవీలులేదు.

యంత్ర ఉద్ధార శ్లోకము –

**శ్లో॥ చంద్రాగ్ని నేత్రయోగశ్చ**
**వేదబాణ రసస్తథా ।**
**ముని నాగ గ్రహోజ్ఞేయాః**
**ఏషా పంచద శీ మతా ॥**

ఈ యంత్రము వలన ధనలాభము – శతృ జయం – దేవతాదర్శనం – విద్య – అధికారము – ఆరోగ్య సిద్ధి కలుగును. మూల మంత్రము 1 లక్షా పాతికవేలు జపం చేయాలి.

భువనేశ్వరీ బీజం కూడా సంఖ్యలతో బాటు వ్రాయడం దీనిలోని విశిష్ఠత. ఎఱ్ఱని వస్త్రములు ధరించి ఏకాంతముగా గణపతి పూజ గావించి యంత్రమునందు ప్రాణ ప్రతిష్ఠ గావించి షోడశోపచార పూజానంతరము జపఫలితం యంత్రమునకు ధారపోయాలి.

| | | |
|---|---|---|
| హ్రీం 6 | హ్రీం 1 | హ్రీం 8 |
| హ్రీం 7 | హ్రీం 5 | హ్రీం 3 |
| హ్రీం 2 | హ్రీం 9 | హ్రీం 4 |

మూల మంత్రము - ఓం హ్రీం శ్రీం క్లీం ఐం నమః

మాస శివరాత్రినాడు యంత్రము లిఖించిన చతుర్విధ పురుషార్ధములు సిద్ధించును. దానిమ్మ పుల్లతో గాని, మారేడు పుల్లతో గాని యంత్రము లిఖించిన సమస్త సంపదలు కలుగును. దరిద్ర బాధ తొలగును.

గోమూత్రము - మనశిల - కర్పూరము - నంది వర్ధనం - గోరోచన మిశ్రముతో సిరా చేసి రావిపుల్లతో 1000 సార్లు యంత్రము లిఖించిన ఇష్టసిద్ధి కలుగును.

## వింశతి యంత్రము

ఇది కూడా సంఖ్యా యంత్రమే. వింశతి అనగా సంస్కృతములో 20 అని అర్ధము. దీనినే హిందీలో బీసా యంత్రం అంటారు. ఉత్తర భారతదేశములో చాలా విరివిగా దీనిని ఉపయోగిస్తారు. కార్య సిద్ధికి ఇది పెట్టింది పేరు. హిందీ రాష్ట్రాలలో ఒక నానుడి కూడా ఇలా ఉంది.

"జిస్ కే పాస్ హో బీసా। ఉస్ కా క్యారే జగదీశా"

అనగా, ఎవరి వద్ద ఈ బీసా యంత్రం ఉంటుందో వారిని ఈశ్వరుడయినా ఏమి చేయగలడు? అని అర్ధం.

ఈ క్రింద "అష్టదళాత్మక వింశతి" యంత్రం ఇవ్వబడు చున్నది. పూజన లేఖన విధానములు పూర్వోక్తముగానే చేయ వలయును. కనుక ప్రత్యేకముగా వ్రాయుటలేదు.



మూల మంత్రము –ఓం హ్రీం క్లీం మమ వాఛితం దేహి స్వాహా వింశతి యంత్రములలో లేఖన విధానము అనేకములున్నవి. వాటి యన్నిటిలో “అష్టదళాత్మక వింశతి” యంత్రమే శ్రేష్ఠమయినది.

పాఠకులు తెలుసుకొనుటకు వింశతి యంత్రములోని రకములు వ్రాయుచున్నాను. చతుర్భుజ డమరు వింశతి – కుబేరవింశతి – స్వస్తి వింశతి – శ్రీ వంశతి – శక్తి వంశతి – లక్ష్మీ వింశతి సౌభాగ్య వింశతి – విఘ్న నాశక వింశతి – ద్యూత విజయ వింశతి మొదలయినవి కలవు.

## నవగ్రహ యంత్రములు

జాతక చక్రములోని దుర్భల గ్రహములను వాటి బాధలను నివారించుకొనుటకు – దశాంతర్దశరీత్యా గ్రహ దోష నివారణకు – గోచారరీత్యా పాపగ్రహ అరిష్ట నివారణ ద్వారా, అనుగ్రహ సిద్ధి, ఇష్ట శుభ ఫల ప్రాప్తికి నవ గ్రహ యంత్రములను నిర్మించి పూజించు కొనవచ్చును. ప్రత్యేకముగా తయారు చేసి పర్సులో గాని – ఉంగరముగా గాని చేయించి ధరించవచ్చును.

నిర్దిష్ట మంత్రముతో గ్రహజపము చేసిన పిమ్మట – ఆ యంత్రమును ఆ గ్రహ సంబంధ వారములో ఆ గ్రహ సంబంధ హోరలో ధరించవలయును.

ఆ గ్రహ సంబంధ ధాన్యములను ఆయా వారములలో దానము చేయవలయును. ఆ గ్రహ సంబంధ వస్తువులను కూడా దానములియ్య వచ్చును. లోహములు కూడా దానము చేయంవచ్చును. వస్త్రదానము ఆయా గ్రహములకు సంబంధించిన రంగులు కలవి తప్పని సరిగా చేయవలయును. రత్నధారణ చేయునపుడు ఆ రత్రముకల ఉంగరమును సంబంధిత వ్యక్తి యొక్క గోత్రనామములతో సంప్రోక్షణ చేయువలయును. గ్రహ సంబంధి మంత్రముతో దానిని శక్తి వంతము చేయవలయును.

| గ్రహము | యంత్రం | మంత్రం | తంత్రం |
|---|---|---|---|
| 1. సూర్యుడు |  | ఓం హ్రీం హ్రీం హ్రీం సః సూర్యాయ నమః 7000 జపము | కెంపు ధరించాలి పుష్యార్కయోగంలో మంచిది. గోధుమలు |
| 2. చంద్రుడు |  | ఓం శ్రీం శ్రీం శ్రౌం సః బౌమాయనమః 11,000 జపము | ముత్యం, వెండి తెల్ల బట్టలు బియ్యం |

| గ్రహము | యంత్రం | మంత్రం | తంత్రం |
|---|---|---|---|
| 3. కుజుడు |  | ఓం క్రాం క్రీం క్రౌం<br>సః భౌమాయనమః<br>10,000 జపము | పగడం<br>రాగి, కందిపప్పు<br>ఎర్ర వస్త్రములు |
| 4. బుధుడు |  | ఓం బ్రాం బ్రౌం సః<br>బుధాయ నమః<br>4,000 జపము | పచ్చ, ఇత్తడి<br>పెసరపప్పు<br>ఆకుపచ్చ రంగు |

| గ్రహము | యంత్రం | మంత్రం | తంత్రం |
|---|---|---|---|
| 5. గురుడు |  | ఓం గ్రౌం గ్రీం సః<br>గురవే నమః<br>19000 జపము | పుష్యరాగం<br>బంగారం,<br>సెనగపప్పు<br>పసుపురంగు |
| 6. శుక్రుడు |  | ఓం ద్రాంద్రీంద్రౌం సః<br>శుక్రాయ నమః<br>19000 జపము | వజ్రం, బంగారం<br>బొబ్బర్లు<br>తెలుపు, నీలం |

| గ్రహము | యంత్రం | మంత్రం | తంత్రం |
|---|---|---|---|
| 7. శని | 12 7 14<br>13 11 9<br>8 15 10 | ఓం ఖ్రాంఖ్రీంఖ్రౌం సః<br>శనైశ్చరాయ నమః<br>23,000 జపము | నీలం, సత్తు<br>నువ్వులు<br>నలుపు |
| 8. రాహువు | 13 8 15<br>14 12 10<br>9 16 11 | ఓం భ్రాంభ్రీంభ్రౌం సః<br>రాహవే నమః<br>18,000 జపము | గోమేధికం<br>అభ్రకం, వెండితో<br>మినపప్పు<br>విభూతి రంగు |

| గ్రహము | యంత్రం | మంత్రం | తంత్రం |
|---|---|---|---|
| 9. కేతువు |  | ఓం ప్రాం‌ప్రీం‌ప్రౌం సః<br>కేతవే నమః<br>17,000 జపము | వైఢూర్యం<br>ఉలవలు<br>3 రంగుల మిశ్రమం |

# చండీ యంత్రము

దుర్గాదేవికే మరియొక పేరు చండి. ఈమెకు అనేక విధములైన యంత్రములున్నవి. భక్తుల కోర్కెలు తీర్చుటలో అన్ని యంత్రములు సమర్థములైనవే. ప్రస్తుతము క్రింద ఇచ్చిన యంత్రము సరళమై -సులభమై-త్వరితముగా ఫలితమిచ్చునది. దీనిని రాగిరేకుపై గాని-భూర్జపత్రముపైగాని శుభదినమున లిఖించి, దానిపైన దుర్గాదేవి పటముంచి పంచోపచార పూజ గావించాలి. అనంతరం ధ్యానస్తోత్రము చేసి జపంచేస్తే మంచిది.

**ధ్యాన శ్లోకం: అక్షస్రక్ పరశుంగ దేఘు కులిశం పద్మం ధనుష్కుండికాం**
**దండం శక్తి మసించ చర్మ జలజం ఘంటా సురాభాజనం।**
**శూలం పాశ సుదర్శనంచ దధతీ హస్తైప్రసన్నాననాం**
**సేవై సైరిభమర్దినీ మిహ మహాలక్ష్మీం సరోజస్థితామ్॥**

రక్త చందనమాలగాని-పగడముల మాలతో గాని చండీమూల మంత్రాన్ని జపించాలి. రుద్రాక్ష మాలతో కూడా జపం చేయవచ్చు. ఎర్రని వస్త్రములు ధరించాలి.



# తంత్రపీఠం

'హేవజ్రతంత్రం' మూల గ్రంధము 6 వేల శ్లోకములు గలది. ఇది క్రీ॥శ॥ 8వ శతాబ్దములో సంస్కృతములో రచించబడి క్రీ॥శ॥ 1055 లో ధర్మపాలునిచే చైనా భాషలోనికి అనువాదము చేయబడినది.

శైవాగమములలో వలెనే బౌద్ధతంత్రములందును 4 పాదములు కలవు. అవి

1. క్రియ - (తంత్రశాస్త్రము)
2. చర్యా - (సాధనా వివరములు)
3. యోగం - (ఆసన - ప్రాణాయామాదులు)
4. అనుత్తరయోగం - (వామాచారం)

1. క్రియా విభాగములోని తంత్ర శాస్త్రము, భౌతికములైన బాధ నివారణకు సర్వ జనులకు ఉపయోగించు కర్మకాండను వివరించును. వర్షము కురిపించుటకు, సర్ప దంశానివారణ, దేవ ప్రతిష్ఠాది కర్మలు మొదలగునవి వివరించును.

2. చర్యా విభాగమందు - వైరోచనాభి సంబోధి సూత్రము వంటి గ్రంధముల వలె బహిర్యోగ - అంతర్యోగ సాధనా వివరములను తెలియజేయును. నైతిక నియమములు, బుద్ధత్వ ప్రాప్తికి మార్గములు బోధించును.

3. యోగ విభాగమందు - కాయ, వాక్, చిత్తములందు పరిశుద్ధి సాధించు పద్ధతులు, ప్రజ్ఞ పొందు విధానము, ఈ శరీరము తోనే ధర్మకాయము పొందు మార్గము, వివరించును.

4. అనుత్తర విభగమునందు ముఖ్యముగా 2 విభాగ ములున్నవి. ఇవి పురుష తంత్రములు, స్త్రీ తంత్రములు.

పురుష తంత్రమునకు ఉదాహరణ - గుహ్యసమాజ తంత్రం, స్త్రీ తంత్ర విభాగమునకు చెందునది - హేవజ్ర తంత్రం. పురుష తంత్రములనే ఉపాయ తంత్రం, మహాతంత్రం, డాకతంత్రం (పితృతంత్రం) అని కూడా వ్యవహరిస్తారు.

స్త్రీ తంత్రములను ప్రజ్ఞాతంత్రం, యోగినీతంత్రం, డాకినీతంత్రం (మాతృతంత్రం) అని వ్యవహరిస్తారు.

వీటిలో చర్యా, యోగ విభాగమునకు చెందినవి దక్షిణాచార సంప్రదాయమునకు చెందినవి.

అనుత్తర విభాగమునకు చెందిన యోగినీతంత్రం మొదలగు వామాచారమునకు చెందినవి.

చైనాలో బౌద్ధ వామాచార విధానము (మి-త్సుంగ్) క్రీ॥శ॥ 8వ శతాబ్ది నుండి ప్రాచుర్యములోనికి వచ్చినది. ఇందులకు

1. శుభకరసింహుడు (షాన్-వు-వీ) క్రీ॥శ॥ 637-735
2. వజ్రబోధ (చిన్-కంగ్-చి) క్రీ॥శ॥ 671-741
3. అమోఘ వజ్రుడు (పు-కుంగ్) క్రీ॥శ 705-774

అనబడే బౌద్ధ సన్యాసులు ప్రముఖముగా పేర్కొన దగినవారు.

రహస్యములైన తాంత్రిక విధానములను బోధించు తంత్ర శాస్త్ర గ్రంధములు, చైనాలో క్రీ॥శ॥ 2 వ శతాబ్దినుండే సంస్కృత భాషనుండి – చీనీ బాషకు అనువాదము చేయబడినవి.

క్రీ॥శ॥ 230 లో – 'మాతంగసూత్రం' అను తంత్ర శాస్త్ర గ్రంధమును 'చు–లు–ఎన్' చైనా భాషలోకి సంస్కృతము నుండి అనువాదము చేసెను.

క్రీ॥శ॥ 5 వ శతాబ్దిలోనే చైనా గ్రంధములలో "శిష్యునకు ఉపదేశమిచ్చు సమయములో చేయు అభిషేకము. (పూర్ణాభిషేకము) గూర్చి వివరణలున్నవి.

'తత్త్వ సంగ్రహం' అనే యోగ తంత్ర గ్రంధము క్రీ॥శ॥ 7వ శతాబ్దిలో దక్షిణ భారతదేశములో సంస్కృతములో రచించబడినది. ఇది చైనా భాషలో ముగ్గురిచే అనువదించ బడినది. 3 రకముల అనువాదములున్నవి. 30 వాల్యూమ్స్‌లో క్రీ॥శ 1015లో దానపాలుడు చేసిన ఒక సంపూర్ణ అనువాదము లభించుచున్నది. మిగిలిన గ్రంధములలో సైనో–జపానీయ రహస్య తంత్ర విధానములు చెప్పబడినవి.

క్రీ॥శ॥ 726లో సుబాహ పరిపృచ్ఛతంత్రమును, శుభాకర మిశ్రుడు చైనా భాషలో అనువదించాడు. క్రీ॥శ॥ 760లో గుహ్యతంత్రమును; అమోఘవజ్రుడు చైనా భాషలో అనువాదం చేశాడు.

అనుత్తరయోగతంత్ర విభాగములోని తంత్ర గ్రంథములు క్రీ॥శ॥ 10వ శతాబ్ది వరకు చైనా భాషలోనికి అనువాదము పరిపుష్టముగా జరుగలేదు.

క్రీ॥శ॥ 1279-1368 కాలములో చైనాలో 'యుఆన్' వంశ పాలనా కాలములో, టిబెట్ తంత్రగ్రంథ గ్రంథములు మిక్కలి ప్రాచుర్యములోనికి వచ్చాయి.

క్రీ॥శ॥ 1245 లో టిబెట్ అయిన సా-స్క్య - పండితుడు (1182 - 1251 క్రీ॥శ॥) కాన్-సు పరిగణాలోని మంగోల్ గోదన్ వెళ్ళాడు. హేవజ్రవాసితునికి దీక్షనిచ్చాడు. ఇతని కుమారుడు మతిధ్వజుడు (హ ఫగ్స్-పా) క్రీ॥శ॥ 1239-1280 "క్యుబిలాయ్"కి గురువు.

యు ఆన్ వంశ పాలనలో సాస్క్యపండితుడు 'లామా' పరంపరలో ఎంతో ప్రముఖ స్థానం వహించాడు. చైనాలో లామాలు చాలా గొప్ప శక్తి సామర్థ్యములు, అధికారము కలిగి యుండేవారు. వీరు టిబెటన్ గ్రంథాలనే అనుసరించేవారు. చైనా అనువాద గ్రంథములను అనుసరించేవారు కాదు.

చైనాలో చివరి వంశమైన 'చింగ్' క్రీ॥శ॥ 1644-1911 పాలనా కాలము వరకు, టిబెటన్ లామాలు ఎంతో ప్రముఖ స్థానము వహించారు.

మార్-పా (క్రీ॥శ॥ 1012-1097) బకహ్- బ్-రుగ్యుద్-పా అనబడే ఒక లామాశాఖను మొదటిసారిగా స్థాపించాడు. వారికి "హేవజ్రతంత్రం" ప్రముఖ గ్రంథముగా ఉండేది.

లామాయిజంలో "కర్మ-పా" శాఖ క్రీ॥శ 12వ శతాబ్ది చివరిలో ప్రారంభించబడినది. ఇది మింగ్ వంశపాలన కాలములో క్రీ॥శ॥ 1368-1644 నుండి వాన్-లీ వంశ పాలనా కాలము వరకు అనగా క్రీ॥శ॥ 1573-1619 వరకు ఎంతో అభివృద్ధి చెంది ఖ్యాతి వహించింది.

మూడవ దలైలామా డ్జే-లగ్స్-పా క్రీ॥శ॥ 1543-1587 ఒక ప్రముఖ లామాలా కీర్తి గడించాడు. క్రీ॥శ॥ 1576లో టిబెట్ వదలి మంగోల్‌లోని అల్టాన్ ఖయాన్ ఆస్థానం చేరాడు. మింగ్ వంశ రాజుల సహాయ సహకారాలతో మంగోల్‌లో లామాయిజం అభివృద్ధి చెందింది. 17వ శతాబ్ధి చివరి వరకు డ్జె-లగ్స్-పా శాఖకు ప్రతిఘటన అనేదే లేదు.

5వ దలైలామా, వర్మ-పా-లామా శాఖను క్రీ॥శ॥ 1642 లో తొలగించి, టిబెట్ నంతటినీ, లాసా నగరం నుండే పరిపాలించాడు.

చైనాలో లామాయిజం-మింగ్ వంశ పాలనలోనూ (పెకింగ్ నగరంలో) -వు-త్సుంగ్ క్రీ॥శ॥ 1506-1521 వంశ పాలనా కాలంలోనూ బాగా రాణించింది.

''వు-త్సుంగ్'' అనంతరం పాలన స్వీకరించిన "షి-త్సుంగ్" క్రీ॥శ॥ 1522-1566 పెకింగ్‌లో లామాలను నిషేధించాడు. బుద్ధిజం నుండి లామాయిజం వేరు చేయబడి నిషేధాజ్ఞలు విధింపబడ్డాయి.

13వ శతాబ్దిలో టిబెట్‌లో నిర్మింపబడిన "పొటాలా" బౌద్ధ లామా మఠము ఎంతో విశిష్టత కలిగినది.

1 లక్షా 30 వేల చ॥గ॥ విస్తీర్ణంలో నిర్మింపబడినది. చైనా రిపబ్లిక్ అయిన తరువాత, కమ్యూనిస్ట్ పాలనలో, 1959 సం॥లో, టిబెట్ ఆక్రమించబడింది. టిబెట్‌లోని సుమారు 6000 మఠములు నిర్మూలించబడ్డాయి. 10 లక్షల బౌద్ధ సన్యాసులు చంపబడ్డారు.

14వ దలైలామా - టిబెట్ నుంచి తప్పించుకొని, భారతదేశం చేరి పండిట్ జవహర్‌లాల్‌ను ఆశ్రయించి మన దేశంలోన ప్రవాస జీవితం గడుపుచున్నాడు.

నేడు టిబెట్‌లో కేవలం 13 బౌద్ధ మఠములు మాత్రమే ఉన్నాయి. పొటాలా ఒక మ్యూజియం అయింది.

టిబెట్‌ను చైనా పాలన నుంచి విముక్తం చేయడానికి 14వ దలైలామా అంతర్జాతీయ వేదిక నుంచి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. శాంతియుతంగా దలైలామా చేసే ప్రయత్నం ఎప్పటికి ఫలిస్తుందో? టిబెట్ ఎప్పుడు స్వతంత్రదేశం అవుతుందో? కాలమే సమాధానం చెప్పాలి.

1989లో దలైలామాకు - అంతర్జాతీయ పురస్కారం "నోబెల్" బహుమతి లభించింది.

**మేడవరపు సంపత్‌కుమార్**

**6.6.2006**
**కాకినాడ - 2**

మేడవరపు సంపత్‌కుమార్

## హేవజ్రతంత్ర విశేషాలు

ఇది ముఖ్యముగా ఒక యోగినీ తంత్రము. దీనిని పద్మ వజ్రుడనబడే సరోరుహుడు, కంపలుడు క్రీ॥శ॥ 8వ శతాబ్దిలో ప్రాచుర్యంలోనికి తెచ్చారు. వీరు రెండవ ఇంద్రభూతి రాజా స్థానంలో ఆచార్యులుగా ఉండేవారు.

వీరు మహామాయాతంత్ర బోధకుడైన "కుక్కురీపాదు'ని సమకాలికులు. హేవజ్ర తంత్రమును గూర్చి, దీని వ్యాఖ్యానము లను గూర్చి ఎన్నో సంక్లిష్ట విషయములున్నాయి.

తారానాథుని వివరణ రీత్యా, సరోరుహుడు – కంపలుల కంటే ముందు సహజయోగిని అయిన చింత యొక్క శిష్యురాలు "డొంబి–హేరుక" 8వ శతాబ్ద ప్రారంభంలో బెంగాల్ రాష్ట్రంలో (వంగదేశం) పాల వంశరాజ పాలనలో హేవజ్ర తంత్రమందు ఆసక్తి కనబరచింది.

అదే సమయంలో ఒరిస్సాలోని 'ఉడ్డీయానం'లో మంత్ర యానానికి ప్రముఖ స్థానమున్నది. ఉడ్డీయానమందే మొట్ట మొదటిసారి యోగినీ తంత్రముద్భవించి బెంగాల్ రాష్ట్రంలోనికి వ్యాప్తిచెందింది.

మొదటి పాల వంశరాజైన గోపాలుడు ఒరిస్సాలో 'ఒదంతపురి'లో బౌద్ధ అధ్యయన కేంద్రం స్థాపించాడు. 8వ శతాబ్ధి చివరలో ధర్మపాలుడు విక్రమ శిల విశ్వవిద్యాలయం

ప్రారంభించాడు. ఇక్కడ ఎంతోమంతి విదేశీ విద్యార్థులు కూడా అధ్యయనం చేసేవారు.

9వ శతాబ్దిలో దేవపాలుడు పూర్వసంప్రదాయమును కొనసాగించుచూ "సోమపురి" లో ఒక విశ్వవిద్యాలయం స్థాపించాడు.

ఈ 'దేవపాల' మహారాజు కాలంలోనే కృష్ణ లేదా కన్వా అనబడే బౌద్ధుడు "హేవజ్రతంత్రం"పై ప్రముఖ వ్యాఖ్యానము "యోగరత్నమాల" రచించాడు.

నలందాకు సమీపంలో నున్న పుల్లమ్రిలో టిబెటన్ బౌద్ధగురువు మర్-పా క్రీ॥శ॥ 1012-1097 హేవజ్రతంత్రం, అష్టయోగినులతో అభ్యసించి టిబెట్‌లో బోధించాడు.

మర్-పా-లామాయిజంలో బేకహ-బ్రుగ్‌యుద్-పా అనే శాఖ స్థాపించాడు. మార్-పా తన యౌవనంలో శాంతిభద్రుని శిష్యుడైన హె బ్రోగ్ - మ (క్రీ॥శ॥ 992-1072) వద్ద సంస్కృతం అభ్యసించాడు.

హె బ్రోగ్-మి, విక్రమశిల విశ్వవిద్యాలయంలో రత్నాకర శాంతి (శాంతి-పా) వద్ద హేవజ్ర తంత్రం అభ్యసించాడు. పది సంవత్సరముల తరువాత టిబెట్ వెళ్లి అక్కడ హేవజ్రతంత్రాన్ని, టిబెట్ భాషలోనికి అనువదించి గొప్పఖ్యాతి గడించాడు. ఇతని వద్ద అధ్యయనం చేసిన వారిలో క్రీ॥శ॥ 1073 లో స-

స్క్యా మతం స్థాపించిన 'డెకోన్-మెచోగ్- రుగ్యల్-పో' క్రీ॥శ॥ 1034-1102 ఒకరు.

"హేవజ్రతంత్ర" సంస్కృత వ్రాతపతి జపాన్‌లోని టోక్యో విశ్వవిద్యాలయ గ్రంధాలయమందున్నది.

హేవజ్ర తంత్ర చైనా భాషానువాదము క్రీ॥శ॥ 1054 లో "ధర్మపాలు"నిచే చేయబడినది. పూర్వం 5 భాగములుగా ఉండే గ్రంధము ప్రస్తుతం 3 భాగములు మాత్రమే లభించుచున్నవి.

ధర్మపాలుడు క్రీ॥శ॥ 963లో కాశ్మీర్‌లో బ్రాహ్మణ కులము నందు కౌశిక గోత్రములో జన్మించాడు. మగధలో సుగత శ్రీపాలుని వద్ద సన్యాసము స్వీకరించి వ్యాకరణ శాస్త్రము అభ్యసించాడు. క్రీ॥శ॥ 1004 లో చైనా వెళ్లాడు. క్రీ॥శ॥ 1017లో దాన పాలుని మరణానంతరం. అసంపూర్తిగా ఉన్న అతని త్రిపిటకానువాదమును సంపూర్తి చేశాడు.

హేవజ్రతంత్రము పూర్తిగా వామాచారమునకు చెందిన తంత్ర గ్రంధము. ఇది పూర్తిగా గురుముఖతః గ్రహించవలసినదే గాని, ప్రయోగ విషయములు యోగినీ పూజ ఇత్యాదులు గ్రంధమునందు వివరించలేదు.

'బుద్ధత్వం' పొందడానికి 4 ఉపదేశములు హేవజ్ర తంత్రము నందు చెప్పబడ్డాయి.

1. గురువు; 2. గుహ్యం; 3. ప్రజ్ఞాజ్ఞానము; 4. చతుర్థి.

ఈ నాలుగు విధములా "పూర్ణాభిషిక్తు" డైనవాడు, బుద్ధత్వ పదవి పొందుతాడు.

1 – గురు – అభిషేకము 5 విధములుగా ఉంటుంది. నీరు – కిరీటం – వజ్రము – గంట – నామము.

అనంతరం 5 కలశములతో పంచామృతములు స్వీకరించి అభిషేకిస్తారు. అపుడు గురువు–శిష్యునికి ఉపదేశ మిచ్చునపుడు ఇవి సన్నిధిలోనే ఉంటాయి. 1. ముద్ర (నవయవ్వన యువతి) 2. విద్య 3. బోధిజ్ఞానము 4. దేవత.

1. క్రియాతంత్రములో అభిషేకమునందు కేవలం నీరు మాత్రమే ఉపయోగిస్తారు. చర్యాతంత్రము నందు 5 రకములుపయోగిస్తారు.
2. గుహ్యాభిషేకము చాలా రహస్యముగా చేయు ప్రక్రియ. ముద్ర (యవ్వన స్త్రీ) రజస్సు కలిగినపుడు చేయు మైధున క్రియ (సెక్సువల్ ఎంటర్‌కోర్స్).

ఈ సంభోగము నందు ప్రజ్ఞ అనబడే స్త్రీ రక్తము, ఉపాయం లేదా సాధన అనబడే పురుష వీర్యముతో కలిసినపుడు ఆనందమనబడే బోధిచిత్తము, ఒక బిందువు ఏర్పడును. శిష్యుని నేత్రములు గుడ్డతో కట్టియుండగా, ఆ శుక్ల శోణిత మిశ్రమ

బిందువును గురువు బొటనవేలు చూపుడు వేలితో గ్రహించి శిష్యునకిచ్చును. అపుడు శిష్యుడు ముద్రవైపు చూచును.

3. ప్రజ్ఞాన జ్ఞానము మరింత రహస్యమైనది. ఇందు శిష్యుడు – ముద్రతో సంభోగము చేయుటకు, గురువు శిక్షణ నిచ్చును. వీర్యమును తిరిగి గ్రహించు పద్ధతి వలన 'బోధిచిత్త' మేర్పడును. దీనిని గురుముఖముగా శిష్యుడు గ్రహిస్తాడు.

మన శరీరమునందు ముఖ్యమైన 3 నాడులు కలవు. 1. లలన (ఎడమ, ప్రజ్ఞ) 2. రసన (కుడి, ఉపాయం) 3. అవధూతి (వెన్ను ఎముక మధ్యనున్నది).

మైధునము చేయుటవలన బోధిచిత్తము, లలన–రసన నాడుల ద్వారా క్రిందకు జారును. దీనిని అవధూతి ద్వారా గ్రహించి ఊర్ధ్వ ముఖముగా చేసి 4 చక్ర స్థానముల ద్వారా అనగా, 1 – నాభి, 2. హృదయం 3. కంఠం 4. శిరస్సు స్థానము చేరవలయును. ఇదే "మహాసుఖ" స్థానము.

ఈ విషయములు మరింత విపులముగా "తత్త్వ సంగ్రహము" నందు వివరింపబడినవి.

మహా సుఖమును పొందిన పిమ్మట, తిరిగి అవరోహణ చేయవలయును. అపుడు కలిగిన స్థితిని 4 చతుర్ధానందముగా బౌద్ధ తాంత్రికులు పరిగణించారు.

ఈ 4 ఆనందములు 4 చక్రములతో అను సంధింప బడియుండును. ఇదంతయూ గురుముఖముగా స్వానుభవము చేతనే గ్రహింపవలసిన విషయము, కనుకనే దీనిని అనుత్తరయోగ విభాగమని పేర్కొన్నారు.

| | అభిషేకములు | సుఖములు | క్షణములు |
|---|---|---|---|
| 1. | గురువు | ఆనందము | విచిత్ర |
| 2. | గుహ్యా | పరమానందం | విపాకం |
| 3. | ప్రజ్ఞానజ్ఞానం | విరామానందం | విమర్ధం |
| 4. | చతుర్ధ | సహజానందం | విలక్షణం |

## వజ్రకులం

బుద్ధుడు– వజ్రగర్భ బోధిసత్వునికి ఇట్లుపదేశించాడు. వజ్రము భేదింపరానిది. సత్యమనగా మూడింటి కలయిక. అవి

1. కామధాతువు, 2. రూపధాతువు, 3. అరూప ధాతువు.

వీటిలో కూడియున్న, జ్ఞానయుక్తుడు వజ్రసత్త్వుడు.

హేవజ్రుధు 5 కులములలో వజ్ర కులమునకు చెందిన వాడు. (మహామాయా స్వరూపుడుగా కూడా కొన్ని చోట్ల చెప్పబడినది).

వజ్ర కుల యోషిత్ భాగములందు విహరించి కాయవాక్ చిత్తములందు సూక్ష్మమైన సమాధిని పొందినవాడు. జ్ఞాన పరిపూర్ణుడైన ఇతడే 'మహా సత్త్వుడు' గా – 'సమయ సత్త్వుడు' గా చెప్పబడ్డాడు.

శూన్యతాజ్ఞానమును తెలిసినవాడు. అనగా అంతులేని కారుణ్యమే శూన్యతా జ్ఞానము.

**శ్లో॥ బోధి చర్యా సమాసేన బోధిసత్త్వో నిగద్యతే।**
**ప్రజ్ఞాన సమాయోగాత్ జ్ఞాన సత్త్వస్తథాగతః॥**

కామాది శత్రువులను జయించి సమ్యక్ దృష్టితో సాధన సాగించాలి.

శరీరమునందు ముఖ్యమైన నాడులు 32 ఉన్నవి. ఇవి జ్ఞానోదయమును కలిగించు 32 ఆలోచనలు. వీటిలో మరింత ముఖ్యమైనవి మూడు. 1. లలన 2. రసన 3. అవధూతి.

లలన జ్ఞాన స్వరూపము – రసన కార్యకుశలత గల నైపుణ్యము అవధూతి మధ్యమ స్వరూపము కలది. గ్రాహ్యా గ్రాహక వర్జితమైనది. ఇవి అక్షోభ్య బుద్ధుని అభివ్యక్తులు.

## 32 నాడుల పేర్లు

1. అభేద్య
2. సూక్ష్మరూప
3. దివ్య
4. వామ
5. వామని
6. కూర్మజ
7. భావకి
8. సేక
9. దోష
10. విష్ఠ
11. మాతరి
12. శబరి
13. శీతద
14. ఊష్మ
15. లలన
16. రసన
17. అవధూతి
18. కృష్ణవర్ణ
19. సామాన్య
20. హేతుదాయిక
21. వియోగ
22. ప్రేమణి
23. ప్రమాణిక
24. సిద్ధ
25. పావకి
26. సుమన
27. త్రయీవృత్త
28. కామిని
29. చండిక
30. కాత్యాయినిక
31. కుమారి
32. దాయిక

3 శరీరములు 3 కర్మలకు ప్రతీకలు. అనగా కాయ–చిత్త– వాక్‌లు, వరుసగా నిర్మాణ, ధర్మ, సంభోగ క్రియలగుచున్నవి.

'ఏవం మయా'

ఏ = లోచనం (బుద్ధుని జ్ఞాననేత్రం)

వం = బోధిసత్త్వుడు

మ = పాండురాబోధి సత్త్వుడు

యా = తారాబోధి సత్త్వుడు.

ధర్మశరీర వృత్తము అష్టారముతో కూడినది. కాయ శరీర వృత్తము సుఖ స్వరూపమై షోడ శార సమన్వితము.

నిర్మాణ కాయ చక్రము 64 దళములు కలది.

మహా సుఖకాయ చక్రము 32 దళములు కలది. ఇవి వరుసగా హృదయ-కంఠ-నాభి-శిరోభాగములలో మన శరీరము నందుండును.

విచిత్ర - విపాక - ఆలోచన - విలక్షణములనే 4 క్షణములు ముఖ్యమైనవి.

4 ఆర్యసత్యములు కలవు. 1) దుఃఖము, 2) సముదాయము, 3) నిరోధము, 4) మార్గము.

4 తత్త్వములున్నవి 1) ఆత్మ, 2) జ్ఞాన, 3) మంత్ర, 4) దేవత.

4 ఆనందములున్నవి. 1) ఆనందం, 2) పరమానందం, 3) విరామానందం, 4) సహజానందం.

4 నియమములు (నికాయములు) కలవు. 1) స్థవిర, 2) మహా సంఘిక, 3) సమ్మితీయ, 4) సర్వాస్తివాద.

ఈ చెప్పబడిన వనిన్నయు సూర్య – చంద్రుల గమనము ననుసరించి వృద్ధిక్షయములు పొందుచుండును.

8 – దిక్కులు

16 – కోణములు

32 – ఘడియలు (1 పగలు)

64 ఘడియలు (1 రోజు)

ఈ విధముగా అంతా చతు స్వరూపముగా నున్నది. చండాలయోగిని నాభి చక్రము నుండి జ్ఞానాగ్నిని ప్రసరింప చేయును. లలన –రసనలు, అవధూతి నాడి వద్ద సమాగమము చెందినపుడు నాభి నుండి శిరోభాగమునకు చలనము జరిగి చండాల యోగిని వలన 'అ' కారము ఉద్భవించును. శిరస్సు నందున్న బోధి చిత్తమును చేరును. అక్కడనున్న 'హం' బీజముతో కలియును. తిరిగి అధో భాగమునకు ప్రవహించును. అ – హం రెండూ కలసి, "అహం" అగును.

ఇది పంచ తథాగతులను దహించును. అనగా రాగ – ద్వేష – మోహము లను దహించి పునర్జన్మ లేకుండా చేయును.

లోచన అనునాడి నాభియందుండి మానవుని దుష్ట కారణములను నశింపచేయును.

| 1 | ఏ | మ | వ | యా | |
|---|---|---|---|---|---|
| 2 | లోచన | మామకి | పాండురా | తారా | వీరు 4 దేవతలు |
| 3 | ధర్మ 8 దళములు | సంభోగ 16 | నిర్మాణ 64 | మహాసుఖ 32 | 4 చక్రములు |
| 4 | విచిత్ర | విపాక | ఆలోచన | విలక్షణ | 4 క్షణములు |
| 5 | దుఃఖ | సముదాయ | నిరోధ | మార్గ | 4 సత్యములు |
| 6 | ఆత్మ | జ్ఞాన | మంత్ర | దేవత | 4 తత్త్వములు |
| 7. | ఆనంద | పరమానంద | విరామానంద | సహజానంద | 4 ఆనందములు |
| 8 | స్థవిర | మహాసంఘిక | సామ్మితీయ | సర్వాస్తివాద | 4 సిద్ధాంతములు |

## 2. మంత్రపటలం

ఈ క్రింది మంత్రము సర్వభూత బలికి ప్రయోగించవలెను.

ఓం ఆః హుం ఫట్ స్వాహా।

అయిదుగురు తథాగతుల బీజ మంత్రములు –

ఖుం–అం–జ్రీం–ఖం–హుం

శూన్యతా హృదయ మంత్రం

ఓం దేవ పిచు వజ్ర హుంహుంహుం ఫట్ స్వాహా।

ప్రతీ మంత్రమునకు ముందు ఓంకారము చివర స్వాహా।

చేర్చవలెనని బుద్ధుని ఆదేశము కలదు.

అక్షోభ్య – తథాగతుని మంత్రము

ఓం అకచటతపయశ స్వాహా।

యోగినుల బీజమంత్రములు బుద్ధునిచే ఇట్లు చెప్పబడినవి.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఏ ఐ ఓ ఔ అం అః ।

హేవజ్ర మంత్రము (ద్విభుజరాజం)

ఓం త్రైలోక క్షేపక హుంహుంహుం ఫట్ స్వాహా।

చతుర్భుజ హేవజ్ర మంత్రం

ఓం జ్వల జ్వలభ్యో హుంహుంహుం ఫట్ స్వాహా।

షడ్భుజ హేవజ్ర మంత్రం

ఓం కిటి కిటి వజ్ర హుంహుంహుం ఫట్ స్వాహా।

+ మనోవాక్కాయాధిష్ఠాన మంత్రము; ఓం ఆః హం

+ రక్షణ మంత్రము

  ఓం రక్ష రక్ష రక్ష హుం హుం హుం ఫట్ స్వాహా।

+ స్తంభనమంత్రము

  ఓం హుం స్వాహా

+ ఉచ్చాటన మంత్రము

  ఓం ఖం స్వాహా

+ విద్వేషణ మంత్రము

  ఓం హ్రీం స్వాహా

+ వశీకరణాభిచారిక మంత్రము

  ఓం హూం స్వాహా

+ ఆకర్షణ మంత్రము
  ఓం ఖుం స్వాహా ।
+ వశ్య మంత్రము
  ఓం కురుకుల్లే హ్రీః స్వాహా।

## కరువు ఏర్పడినపుడు నివారణ

శ్మశాన సూత్రముతో మండలపరిధి నేర్పరచ వలయును. రుద్రభూమి నుండి 5 రంగులు తేవలయును. తెలుపురంగు ఎముకల బూడిద నుండి, నలుపురంగు బొగ్గుల నుంచి, ఎరుపు రంగు ఇటుకపొడి నుంచి, పసుపురంగు మణిశిల నుంచి, ఆకుపచ్చరంగు దొండాకుల నుంచి తేవలయును.

అష్టముఖములతో – చతుష్పాదములు –16 భుజములు, ప్రతి ముఖము త్రినేత్రములతో నాగరాజ అనంత చిత్రము మండల మధ్యమందు లిఖించ వలయును.

నీలోత్పల పుష్ప పిష్టమిశ్ర మృత్తికతో చిన్న నాగరాజ ప్రతిమ చేయవలయును. ఈ ప్రతిమకు పంచామృతములతో అభిషేకము చేసి నల్లని పువ్వులతో నీలోత్పలములతో పూజించ వలయును.

అనంతరం పూజించిన ప్రతిమను నాగపుష్ప వృక్షముపై నుంచవలయును.

కృష్ణ పక్ష చతుర్దశి నాడు, నల్లని ఆవు యొక్క పాలను ఒక కుండలో పోసి ఒక నల్లని కన్య, నల్లని దారమును ఆ కడవకు చుట్టి, మండలమునకు వాయవ్య దిశన చిన్న గొయ్యి త్రవ్వి ఈ కడవను అందుంచవలెను.

అనంతరం గురువు ఈ మంత్రమును వర్షము కొరకై బిగ్గరగా పఠించ వలయును.

"ఓం ఘురు ఘురు ఘుడు ఘుడు వాస మస ఘుట ఘుట ఘోటయ అనంత క్షోభకరాయ, నాగాధిపతయే; హే హే రురుక సప్త పాతాళగతాన్ నాగాన్ కర్షయ వర్షయ గర్జయ పుః హుం హుం హుం స్వాహా॥

ఈ మంత్ర పఠనము వల్ల వర్షము కురవనిచో ఈ మంత్రమునే విలోమ క్రమములో పఠించవలయును. వెంటనే వర్షము కురియును. అయిననూ వర్షము కురవనిచో నాగ ప్రతిమ శిరస్సు ఏడుముక్కలగును.

వర్షమును స్తంభింప చేయుటకు ఈ మంత్రము చదువ వలయును. ఓం ఆర్య శ్మశాన ప్రియాయ హం హం హం స్వాహా

## శతృసేనా నాశనము

కుఠారమూలికలతో పంచామృతములు కలిపి ఒక పిండ మును చేయవలయును. ఈ క్రింద మంత్రము

"ఓం వజ్రకర్తరి హేవజ్రాయ హుంహుంహు ఫట్" - 1008 సార్లు పఠించి సిద్ధిపొందిన అనంతరం ద్రవ్యమును ఒక మట్టికుండ కంఠము వద్ద మంత్రపఠనముతో పూయవలెను.

బ్రహ్మదండి బీజములతో బంధూక పుష్పకములు కుఠార మూలికల చూర్ణమును సూర్యగ్రహణ సమయమునందు తయారుచేసి, అక్షోభ్య ఔషధం (వీర్యం)తో తిలకం చేసి

'ఓం వజ్రకుఠార పాతయ పాతయ ఠ: ఠ:హుం హుం ఫట్ స్వాహా - అను మంత్రముతో ధరించాలి. ఇది వశీకరణకు ఉపయోగించును.

(బంధూకపుష్పము = కోలోసింథస్ ఇండికా)

శత్రునామమును తెల్లజిల్లేడు ఆకుపై వ్రాసి (చిత్రకముతో) ఈ క్రింది మంత్రమును చదవుతూ తుషాగ్నిలో దగ్ధము చేసిన ఎడల సాధ్యవ్యక్తి జ్వరపీడితుడగును.

-ఓం హేవజ్రజ్వలజ్వల శత్రున్ భ్రూం హుం హుం ఫట్ స్వాహా॥

ముందుగా పదివేలు జపించిన సిద్ధించును.

## వశీకరణము

అష్టమి రోజున అశోక వృక్షము వద్దకు వెళ్ళి కుంకుమతో పూజించి మదనఫలముతిని, కామాచికా తిలకము ధరించి ఈ క్రింది మంత్రము జపించవలయును.

+ఓం అముకి మే హ్రీః వశీభవతు స్వాహా॥ 'అముకి" అనుచోట సాధ్యవ్యక్తి పేరు స్మరించవలయును.

సూర్యచంద్రులను మేఘచ్ఛన్నముగా చేయుటకు, పిండితో బింబము చేసి ఈ క్రింది మంత్రమును జపించాలి.

–ఓం వజ్రక మాచల మాచల తిష్ఠ తిష్ఠ హేవజ్రాయ హుం హుం హుం ఫట్ స్వాహా॥

## వజ్ర జ్యోతిష విధి

శుభలక్షణములు గల కన్యను పూజించి "ఓం నగ్రా నగ్రా" అను మంత్రము జపించి, ఆకన్యను ప్రశ్న అడిగిన జవాబు చెప్పును. ఇది గురుముఖముగా గ్రహించవలయును. భూత - భవిష్యత్ - వర్తమానములు చెప్పును.

గౌరియోగిని - శావరియోగిని - వజ్ర డాకిని ఇందు ప్రాధాన్యత వహించెదరు.

## 3. దేవతా పటలం

1. మైత్రి–కరుణ–సంతోషం ఎల్లప్పుడూ కలిగి ఉండాలి.
2. శూన్యత గూర్చి జ్ఞానం కలిగియుండాలి. సర్వ వస్తువులు ఆలోచన వల్లనే అస్తిత్వమును కలిగియున్నది. కనుక బహిరంగముగా గోచరించు జగత్తు శూన్యమే.

వాస్తవముగా లేదు. మన ఆలోచన వల్లనే అది ఉన్నట్లు అనిపించు చున్నది. ఇది కలవంటిది.

3. సూర్యబింబము నుండి "రం" బీజము జనించినది. ఇది ఎర్రని జ్వాలవంటిది. గాఢ నీలపు వజ్ర ఛాయ హుం అనునది.

4. ధర్మధాతు జ్ఞానము కలుగవలెనన్న 'మాతృక' ను, అనగా అకారాది క్షకారాంత వర్ణములను గూర్చి తెలుసుకొన వలయును. అక్షర పీఠముపై కూర్చుండుయోగిని శూన్యతా జ్ఞానమును కలిగించును.

5. హృదయమునందు రం – హుం బీజములను ధ్యానించి జపించవలయును.

6. వజ్రము వంటి, నీలంరంగు గల 'హుం' బీజము శాపమును ఇచ్చు సమర్థత గలది.

7. హేవజ్రుడు ఎంతో కరుణా స్వభావుడు. జ్వలించే సూర్యుని వంటి వాడు హేవజ్ర బోధి సత్త్వుడు.

8. అష్టయోగినీ పరివేష్ఠితుడైన అతనిని ధ్యానించాలి.

9. గౌరి చంద్రుని, చౌరిసూర్యుని, వేతాళి నీటిని, గస్మరి ఔసధమునకు అధిష్ఠాన యోగినులు.

10. పుక్కసి పిడుగును, శావరి షడ్రచులను, చండాలి సంగీత మును ఇచ్చును. డొంబిని సంతోషముతో నృత్య గానములు చేయును.

11. దివారాత్రములు సాధకుడు 'హుం' బీజమును జపించవలయును.
12. ఇట్టి జపము వలన శాపాను గ్రహశక్తులు కలుగును.
13. ఎర్ర బంధూకము వలె గాఢ నీలపు సూర్య గోళమునందు సాధకుని కన్నులు మెరియును.
14. చక్ర–కుండ–కంఠ హారము–రుచక–మేఖలలు అయిదు గురు తథాగతలకు ప్రతీకలగుచున్నవి.
15. హేవజ్రుని రూపము 16సం॥ల బాలికయందు సాధకునికి గోచరమగును. ఎడమచేతియందు వజ్ర, కపాలములు –ఖట్వాంగములు, కుడిచేయి యందు నీలిరంగు పిడుగును ధరించును.
16. 'హుం' బీజమును జపించు సాధకుని అష్టయోగినులు పరివేష్టించి యుందురు.
17. చతుర్భుజములందు క్లేశమార–స్కంధ–మృత్యు–దేవపుత్ర అనబడే వశీకరణ దేవతలగు ప్రతీక ధారణగా గ్రహించవలయును.
18. మొదటి కుడిచేయి యందున్న పిడుగు, రెండవ కుడిచేయి' ప్రజ్ఞాపారమిత' జ్ఞానమును ధరించును.
19. మొదటి ఎడమ చేయి కపాలమును ధరించియుండును. అందు దేవాసురలకు ఇష్టమగు అమృతము నిండియుండును.
20. సూర్య–చంద్రులను ధరించి యుండును.
21. దాన–శీల–క్షాంతి–వీర్య–ధ్యాన–ప్రజ్ఞ అనబడే షడ్బల సంపదగలవాడు. హేవజ్ర భగవానుడు.

22. త్రిశూలము ధరించును.
23. బుద్ధుని ప్రతిమ ప్రజ్ఞను బోధించును.
24. కామ–రూప–అరూప్యధాతు జ్ఞానము కలిగించును.

## 4. దేవతాభిషేకము

ఇది ఒక మంత్రోపదేశ ప్రక్రియ, హృదయ కుహరంలో నుంచి స్వబీజమైన 'హుం' కారము ధ్వనించాలి.

దానికి రెండు చేతులా పాశాంకుశములుండాలి. (ఆం–క్రోం)

అష్టయెగినులతో ఓం కారము పరివేష్ఠించి యుంటుంది. పంచామృతములు 5గురు తథాగతులకు ప్రతీకలు అందు కుంకుమ పువ్వు – సుగంధ పుష్పాలు మిళితం చేయాలి.

గానం– వాద్య ఘోష మధురంగా మ్రోగుతూ ఉండాలి. పృథివీ అప్ వాయువులకు అధిష్ఠాత్రులైన లోచన – మామకి – పాండురాలు, వజ్రకుల కుటుంబంలో దైవత్వ సిద్ధికై ధ్యానిస్తూ మస్తకాభిషేకం జరుగుతుంది.

## 5. తత్త్వం

1. ప్రతీ పదార్థము స్వభావరీత్యా శూన్యమే. రూపము గాని, నాదముగాని లేనే లేవు. చూచువాడు గాని, వినువాడు గాని లేరు.

2. గంధ– రస– స్పర్శలు లేనపుడు, వాసనచూచువాడు రుచి చూచువాడు – స్పర్శ పొందువాడు ఎవరూలేరు. యోగము చక్కగా తెలిసిన వానికి జ్ఞానము– జ్ఞేయము రెండూ లేవు.
3. తల్లిని – చెల్లిని గౌరవించి ఆదరించాలి. నటి, రజకివలె డొంబిని యోగిని కూడా ఆదరణీయురాలే.
4. బ్రాహ్మణి వలెనె చండాలి యోగిని కూడా ఆదరణీయురాలే. పూజలో వారిని గౌరవించాలి.
5. అభిమానంగా ఆదరించాలి. లేనిచో వారి క్రోధశక్తి వలన అరిష్టము కలుగును.
6. మోక్షమునకు, లేదా నిర్వాణమునకు ఈ అయిదు కులములు ముఖ్యములు.
7. వజ్ర–పద్మ–కర్మ–తధాగత–రత్న అనబడు ఈ అనబడు ఈ అయిదుకులములు శ్రేష్టము మైనవి.
8. వజ్ర అంటే డొంబి, పద్మ=నటి లేదా వేశ్య, కర్మ= రజకి, తధాగత = బ్రాహ్మణి, రత్న = చండాలి కన్య
9. హేవజ్రుని నిర్గమనానంతరం తధాగతుడు బోధివృక్షము కింద జ్ఞానము పొందాడు.
10. ఉన్నవి పైన పేర్కొన్న అయిదు కులములే, వీరే మనో వాక్ –కాయములతో మూల భూతములుగా ప్రకటితమగు చున్నారు.

11. దేహము అస్తిత్వములోనికి రాగానే ఈ అయిదు విభాగములలో దేనికో ఒక దానికి చెందును.
12. ధ్యాన–ధ్యేయములు లేకుండా పంచతత్త్వ ప్రకృతి ఇట్లు ఉండును.
13. మహా విరోచన – అక్షోభ్య తధాగత – అమోఘ సిద్ధి, బుద్ధ రత్న సంభవ – అమితాయు.
14. (సరోరుహ వ్యాఖ్యానుసరించి)–వైరోచనుడు బ్రహ్మ – అమోఘ సిద్ధి శివుడు–అక్షభ్యుడు విష్ణువు. రత్న సంభవుడు సర్వుడు, అమితాభుడు తత్త్వము. వీరే పంచ బుద్ధులు.
15. బ్రహ్మ జ్ఞాన స్వరూపుడు విష్ణువు వినయశీలి – శివుడు కృపగలవాడు – దయాళువు.
16. వీరు నిత్య – నిరతిశయ సుఖస్వరూపులు.
17. జ్ఞానము పొందినవారు, బుద్ధుని వంటివారు. వారు షట్ సుఖములు పొందెదరు.
18. బుద్ధుడు కామమును జయించెను. ప్రతీ పదార్ధ స్వభావమును తెలుసుకొనెను.
19. జ్ఞాన సోదరిలకు రజికి ఐత్యాదులకు ఆ జ్ఞానము బోధించెను.
20. గుణములే ప్రధానములు.
21. వీరు నృత్యము చేయునపుడు, నేత నేయునపుడు – అతడు ఎంతో కరుణామయుడు.

22. దైవీయ గుణములు చెప్పునపుడు, సాధకుడు మండల కల్పన చేయవలయును.
23. ముద్రను చేతులతో ఏర్పరచి, ధ్యానించ వలయును.
24. ఇట్టి ధ్యానమే జనన – మరణ చక్రమునుండి విముక్తము చేయును.

## 6. చర్య (సాధన)

బుద్ధుడు – వజ్రగర్భబోధిసత్త్వునకు ఇట్లుపదేశించెను.

ఈ సాధన వలన దుఃఖ సముద్రమునుండి తరించును. మరణపర్యంతము సాధన చేయుచునే ఉండవలయును.

తలపై తలపాగ – చెవికి కుండలములు – కరమునకు కంకణములు – తటికి మేఖల – పాదమునకు కడియములు వేళ్లకు ఉంగరములు ధరించాలి.

కంఠమునకు హారముండాలి. వ్యాఘ్రచర్మం ధరించాలి. పంచామృత భోజనము శూన్యతాజ్ఞానముండాలి. జాతి భేదము పనికిరాదు.

చెట్టుకిందగాని – రుద్రభూమిలో గాని అర్ధరాత్రిలో ఏకాంత నిశ్శబ్దములో పరిశుద్ధుడై ధ్యానించాలి. అపుడు బోధి జ్ఞానము కలుగుతుంది.

పరిపూర్ణ సాధనలో సద్గురువునాశ్రయించి అతని నభ్యర్థించి, గురుకృపవలన అభిషిక్తుడవ్వాలి.

వజ్రకులమునందు గురువు ప్రవేశపెట్టును. ఆ కులాచారము వలన సాధకుడు సమాధి స్థితి పొందును.

తలపాగ = అక్షోభ్యతథాగతునికి ప్రతీక
చెవికుండలములు = అమితాయుతథాగతుడు
కంఠహారము = రత్న సంభవతథాగతుడు
చేతి కడియము = మహా విరోచనతథాగతుడు
మేఖల = అమోఘసిద్ధి తథాగతుడు
ఖట్వాంగము = జ్ఞానప్రతీక
డమరుకము = కళా నైపుణ్యము

కేవలం స్వార్థము కొరకు ఐహిక సుఖ సిద్ధికై సాధన చేయరాదు. మద్యము వలన మత్తుడై ఆనందము పొందిననూ, ఔషధ సేవన చేసిననూ సత్య నిష్ఠ కల్గియుండాలి. జరామరణములకు భయపడరాదు.

జడలు ధరించి, హుంబీజముతో కపాలధారి కావాలి. కపాలము 5వేళ్ల పొడవుండాలి.

రాగ-ప్రతిఘం-స్త్యానమర్ధ-ఔద్ధత్య-విచికిత్స దోషములు కలిగియుండరాదు. నిత్యసంతోషముగా నుండాలి సంశయము లుండరాదు. సుఖదుఃఖములకు చలించరాదు.

యధాలాభ సంతుష్టుడై జీవించాలి. ప్రాప్తించిననూ, నష్టపోయిననూ నిశ్చల మనస్సుతోనుండాలి.

భేదభావము పనికిరాదు. అశ్రద్ధ-బద్దకం-ఆలస్యం మంచిది కాదు. దయకలిగి యుండాలి.

నిరంతరం జప-ధ్యానములాచరించాలి. సింహామువలె నిర్భయముగా సంచరించాలి.

యోగి ఆహార-పానీయములకై లాలస పడరాదు. సకల ప్రాణులందు దయగలిగి యుండాలి.

## 7. చోమా

## (రహస్య గుర్తుల వివరణ)

బుద్ధుడు - వజ్రగర్భునితో ఇట్లు చెప్పెను.

సాధనలో ముఖ్యమైన స్థలములు 12 గలవు.

1. జాలంధర, 2.కామరూప, 3.పూర్ణగిరి, 4.ఉడ్డీయాన ములు,5. మాళవదేశము- సింధునది, 6. మున్మని-కౌమార పాతకీ-దేవీకోట,7.కులటా-అర్బుదనగరం-గోదావరి - హిమాద్రినది. 8. హరికేలా-లంపాక- కాంచిక - సౌరాష్ట్ర. 9. కళింగ-మీకర-కొంకణ,10. పీలవ నగర సమీప గ్రామములు,11. చరిత్ర-కోసల-వింధ్య,12. సముద్రతీర ప్రాంతములు, ఫల వృక్షములున్న ప్రదేశములు.

కృష్ణపక్షము సాధనకు మంచిది, చతుర్దశి చాలా మంచిరోజు. అందరియందు కరుణ గలిగియుండాలి.

దుష్టులయందు మరింత అధికముగా దయతో వ్యవహరించాలి. ఇతరుల గూర్చి ఆలోచించుట వృధా. ఆహార-పానీయ సమయములందు సంభాషించరాదు.

హే = శూన్యత

రు = జ్ఞానం

క = సంశయ నివృత్తి.

## 8. యోగినీ చక్రం

ముందుగా ఒక త్రికోణము నిర్మించి అందు అర్ధ వృత్తము లిఖించాలి. త్రికోణం చుట్టూ ఒక వృత్తము లిఖించాలి. వృత్తము చుట్టూ అష్ట దళములు ఏర్పరచాలి. ఇదే యోగినీ చక్రమనబడును.

తూర్పు - వజ్రయోగిని

దక్షిణం - గౌరియోగిని

పడమర - వారియోగిని

ఉత్తరం - వజ్రడాకిని

మధ్యలో - నైరాత్మ్య యోగిని

అష్టదళములందు - 1 - గౌరి యోగిని

2 - చేరి యోగిని

3 - వేతాళ యోగిని

4 – ఘస్మరి యోగిని

5 – పుక్కసీ యోగిని

6 – శావరి యోగిని

7 – చండాలి యోగిని

8 – డొంబిని యోగిని

వీటన్నిటికీ పైన – ఖేచరి యోగిని

క్రింద – భూచరి యోగిని.

ఈ యోగినులంతా ఉగ్రస్వరూపులు–నల్లనిరంగు కల వారు. నైరాత్మ్యయోగిని కుడిచేతిలో కర్తరి ధరించి యుండును. ఎడమ చేతిలో కపాలము – ఖట్వాంగము ధరించి యుండును.

చక్రధ్యాన సమయములో ముందుగా నలుపు, తదనంతరం ఎరుపు –పసుపు – ఆకుపచ్చ – ఊదా – తెలుపు రంగులను వరుసగా భావించాలి.

సహజానందము ధ్యానమువల్ల లభించును.

## 9. విశుద్ధి

1– పంచతత్త్వములు – ఆరింద్రియములు – అజ్ఞానము ఇవన్నీ పరిశుద్ధిగావించవలయును.

2– రూపమును చక్షువు గ్రహించుచున్నది. శ్రవణము ధ్వనిని గ్రహించుచున్నది. ఘ్రాణేంద్రియము వాసనను గ్రహించు చున్నది. రసనేంద్రియము రుచిని గ్రహించుచున్నది.

గౌరి – తూర్పు – రూప – ఇంద్రుడు
చేరి – దక్షిణం – శబ్ద – యముడు
వేతాళి – పశ్చిమం – గంధ – వరుణుడు
ఘస్మరి – ఉత్తరం – రస – కుబేరుడు
భూచరి – నీచం – స్పర్శ
ఖేచరి – ఊర్ధ్వం – ధర్మ
పుక్కసి – ఈశానం – భూమి – ఈశానుడు
శావరి – ఆగ్నేయం – జలం – అగ్ని
చండాలి – నైరుతి – అగ్ని – తేజస్సు
డొంబిని – వాయువ్యం – వాయు – వాయువు.
హేవజ్రునికి 16 భుజములుండును – 16 శూన్యతలు
4 పాదములు – 4 కామములు
8 ముఖములు – 8 విమోకములు
3 నేత్రములు – 3 వజ్రములు
ఆలోచన పరిశుద్ధముగా నున్నచో సర్వమూ పరిశుద్ధిగా నుండును.
వజ్రి – ద్వేషము
వారియోగిని – ప్రేమ
వజ్రడాకిని – ఈర్ష్య
గుప్తగౌరిక – పై శున్యము
వజ్ర యోగిని – మోహము – కలిగించును.

"ఆలోచన" అనునది స్వచ్ఛముగా నుండి, ధ్యాన సాధన చేసినచో బంధముక్తుడై నిరతిశయ సుఖము పొందును.

## 10. అభిషేకము

భుశుద్ధిచేసి, హుంబీజముచ్చరించుచూ మండలము లిఖించాలి. పంచరత్నముల (పగడం - ముత్యం - వైడూర్యం - బంగారం-వెండి) చూర్ణముతో దానిని అలంకరించాలి. లేదా వరిపిండితో లిఖించాలి. 3. హస్తముల ప్రమాణముండాలి. శిష్యుని ముఖమును పట్టుబట్టతో ఆచ్ఛాదించాలి. శూన్యతా జ్ఞానము బోధించాలి.

సుగంధములు-సుమములు నిడిన 8 పాత్రలుంచాలి. చక్కటి దీపాలు వెలిగించాలి. కలశములలో కొద్దిగా పంచ చూర్ణములు వేసి, కలశ కంఠములకు పట్టు దారము చుట్టాలి. 9వ కలశముగా దివ్యకలశమునుంచాలి.

మంత్రజపము పూర్తి చేయాలి. క్రోధము - గర్వము - ద్వేషము అనే 3విషయములు కలిగియుండరాదు.

ఆలోచనలు-మిత్ర పరముగాను, శతృపరముగాను ఉండరాదు. తటస్థముగానుండవలయును.

వజ్రడాకిని అనుగ్రహము కలుగ వలెనన్న ద్వేష-క్రోధ -గర్వములు వహించరాదు.

అభిషేక ప్రక్రియ గురుముఖముగా గ్రహించ వలయును.

## 11.కల్పరాజం

హ్రీః – అను బీజాక్షరజపముచే 'కురుకుల్ల' శక్తి దర్శన మగును. రక్త వర్ణరూపము – చతుర్భుజములు – ధనుర్బాణ ములు, ఉత్పలము ధరించి యుండును.

ఉదయముననే మండలము నిర్మించి అందు బుద్ధ ప్రతిమనుంచి మంత్రజపము చేయవలయును.

ఓం వజ్రపుష్పే ఆః హూం స్వాహా
ఓం వజ్రధూపే ఆః హూం స్వాహా
ఓం వజ్రదీపే ఆః హూం స్వాహా
ఓం వజ్రగంధే ఆః హూం స్వాహా
ఓం వజ్రనైవేద్యే ఆః హూం స్వాహా

హోమము కూడా మండలమునందే చేయవలయును. శాంతిహోరమునందు అగ్నిగుండము వృత్తాకారముగా నుండవలయును. 1 1/2 ప్రమాణము వెడల్పు, అందు సగభాగములోతు కలిగియుండాలి.

పుష్టికర్మకు – చతురస్రాకారము – పసుపు రంగు రెండడుగుల వెడల్పు, ఒక అడుగు లోతు ఉండాలి.

మారణ కర్మకు త్రికోణ కుండము – నలుపు రంగు 10–5 ప్రమాణము వెడల్పు లోతు ఉండాలి.

వశ్య కర్మకు - ఎరుపురంగు

ఆకర్షణ కర్మకు - ఎరుపు

విద్వేషణకు - నలుపు

మారణ-విద్వేషణ కర్మలలో హోమమునందు ముళ్లుగల చెట్టుయొక్క సమిథలు ఉపయోగించాలి.

శాంతి-పుష్టి కర్మలందు హోమములో కమలములు - కలువలు ఉపయోగించాలి.

అగ్నిస్థాపనలో ఈ క్రిందిమంత్రం పఠించాలి.

+ ఓం అగ్నయే మహాతేజః సర్వకామ ప్రసాథక కారుణ్యకృతసత్వార్థ అస్మిన్ సన్నిహితోభవ.

త్వందేవి సాక్షిభూతోసి హేవజ్రక్రోథ పూజితే, నానారత్నధరి ధాతరి - అని మండలం లిఖించాలి.

- స్వార్థాన్ చైవ పరార్థాన్చ సాధితుంగచ్ఛహవ్యభుక్ ఆగమిష్యసియధాకాలే సర్వసిద్ధింకురుష్వమే॥

ఓం జః హూం వం హః ఖం రం

పాద్యమునకు -

ఓం రీ రీ హూం ఖః

నైవేద్యమునకు

ఓం ధ్వం ధ్వం

## 12. సిద్ధి నిర్ణయం

వజ్రగర్భునికి బుద్ధుడిట్లు ఉపదేశించాడు. శ్రీ హేరుకుని యందు లేదా నైరాత్మ్యయోగిని తత్త్వమునందు ఓలలాడు వారు ధన్యులు.

మంత్రోచ్చారణ - ధ్యానము అంత్యంత ప్రధానములు. రాత్రియందు హేరుక ధ్యానము విశేష ఫలప్రదము.

పరిశుభ్రుడై నూతన వస్త్రములు ధరించి చేతులకు పాదములకు చందనము పూసుకొని తాంబూలము వేసుకొని సుగంధ ద్రవ్యధూపములు వెలిగించి కేవలం ఫలాహారి అయి ధ్యానము చేయవలయును.

మనసులోనికి ఇతర ఆలోచనలేవీ రానీయరాదు. ఆలోచనా సంపర్కమైన మనస్సు విషపూరితమగును.

విచారము-రోగము -విషయాసక్తి ఇవి మూడు భయం కరమైన విషయము వంటివి.

సంజీవ-కాలసూత్ర-సంఘాత-రౌరవాది పంచ నరకమలలో పడరాదు.

ఇంద్రియ వికారములను జాగ్రత్తగా గమనించవల యును. గర్వము-అహంకారము విడచిపెట్టి సాధన సాగించ వలయును. పరిశుద్ధ కర్పూరమువలె మనస్సు ఉండ వలయును.

తథాగతుడు దయాసముద్రుడు–ఉత్పత్తి– ప్రలయములు రెండూ ఆయనవల్లనే సంభవించుచున్నవి. ఇది నిరంతరమూ కొనసాగుచునేయుండును. దీనికి అంతము లేదు.

ధ్యాత–ధ్యానము రెండూ, ఒకే పుష్పమునకు ఉన్న సుగంధము వంటివి. రెండూ ఒకటే. ప్రకృతిరీత్యా పుష్పము అస్తిత్వములోలేనిచో వాసనకూడా లేనిదేయగును.

వజ్రయోషిత్సమాధి పరమానందదాయకము. చక్ర సాధన 32 చిహ్నములతో కూడియున్నది. ఆలోచనయొక్క పరిశుద్ధతా స్థితేనిర్వాణమనబడును. విపరీతౌషథకల్పన వంటి ప్రక్రియ ఈ సాధనలొ ప్రయోగింపబడుచున్నది. 'ఉష్ణం ఉష్ణేన శీతలం' వంటిది.

మినపరొట్టి తిని ఒళ్ళుపెరిగిన వ్యక్తికి వాత గుణముచేత రోగము తగ్గించుట వంటిదే ఈసాధన.

మనిషికి పతనము కలిగించు కామము, సాధనలో నియమిత దేశ–కాల–వ్యక్తులతో నియంత్రించి, దానిని సామరస్యమొనర్చి శుద్ధ సుఖానుభూతిని కలిగించి రాగక్షయము పొందించునదే చక్రసాధన.

## 13. సాధనోపాయం

వం – బీజము సర్వ సౌఖ్యములకు ఆలయము వంటిది. ఇది జ్ఞానాత్మకము. తత్త్వముద్ర శ్రేష్ఠమైనది.

1. జీవహింస చేయరాదు. తన ఆలోచనలను గమనించుచుండ వలయును.
2. ఇతరుల అనుమతి లేనిదే వారి వస్తువులు గ్రహించరాదు.
3. సర్వమూ శూన్యమను జ్ఞానము కలిగియుండాలి.
4. అసత్యమాడరాదు.

పంచేంద్రియములు – మనస్సు మొత్తం 6 మానవుని అజ్ఞానములో బంధించును. ఇవన్నీ వజ్రుని వల్ల తొలగును.

పంచతత్త్వములు – మనస్సు, చిత్తాకర్షకములు. జల చంద్రుని వంటి భ్రాంతి కలిగించును.

జ్వాలా కాష్ఠములు గుండ్రముగాత్రిప్పునపుడు చేతులనుంచి జ్వాలామండలముద్భవించినట్లు కనబడును. కాని వాస్తవమదికాదు కదా! ఆ మండలము నిజమూ కాదు! అలాగని అబద్ధము కాదు! ఇట్లే ప్రపంచమును గూర్చి భావించవలయును.

ఆహార – పానీయములను గూర్చి అమిత శ్రద్ధ వహించరాదు. విగ్రహారాధన చేయరాదు. జాతి వాదము పనికిరాదు. అద్వయజ్ఞానము సాధించవలయును.

సంధ్య భాషలో కొన్ని పదములకు సాంకేతికార్థము లున్నవి. అవి ఇట్లుండును.

మద్యము = ఫలము
(సంభోగం) మిలనం = ఆకర్షణం
ఖేటప్రేంఖణం = గమనాగమనములు
అస్త్యాభరణం = ముత్యములు
డమరుకం = నాదం
దుందుర = అల్పపుణ్యము గలవాడు
కాలింజర = ప్రసిద్ధుడు
డిండిమ = అస్పృశ్యుడు
కపాలం = పద్మభాజనం (తామరాకు)
తృప్తికర = ఆహార, పానీయములు
మాలతీంధన = శాకాహారము
గూత = చతుస్సమములు, అగరువత్తులు
మూత్రం = సువాసన ద్రవ్యం, కస్తూరి మొ॥
సిహ్లకం = రక్తము (స్వయంభూ)
శుక్రం = కర్పూరం
మాంసం = అన్నం (తెల్లనైన శ్రేష్ఠవరి)
యోగం = కలయిక
బోలక =
కక్కోలకం = పద్మం
కులం = కుటుంబం
వర్ణం = అభేదము.
మంత్రయాన రీత్యా –

డొంబి – వజ్ర జాతికి చెందినది (శౌచలయం శుభ్రం చేయునది)

నటి = పద్మజాతి (వేశ్య)

చండాలి = రత్నజాతి (కడజాతి స్త్రీ)

ద్విజ = తధాగత జాతి (బ్రాహ్మణ స్త్రీ)

రజకి = కర్మజాతి (చాకలి స్త్రీ)

ముద్రా స్త్రీ సర్వ శ్రేష్ఠురాలు.

అశ్రద్ధతో గాని, అస్పష్టముగా గాని మంత్రోచ్చారణ చేయరాదు. అట్లు చేసినచో "చతుష్పీఠ" యోగినులు కోపముచెంది అరిష్టము కలిగించెదరు.

(చతుష్పీఠములనగా – కామరూప – ఓడ్యాణ – జాలంధరం – పూర్ణ గిరి పీఠములు. ఇవి ఆనాడు బౌద్ధపీఠములుగా ప్రఖ్యాతి పొందినవి. కాలాంతరములో అవి హిందూ–శక్తి పీఠములుగా పరిగణింపబడ్డాయి).

## 14. సర్వతంత్రముద్రణ పిండార్థం

వజ్రస్త్రీ – గానముచేయుచూ నృత్యము చేయును. ఆ పాట ఇట్లుండును.

కొల్లాయిరేత్తియా బోలా ముమ్ముణిరే కాకోలా

ఘణ కబితా హోవజ్జై కరుణేకి అయి రోలా

తహి బల ఖజ్జై గాఢే మయణ పిజ్జై

హాలే కాలింజర పణిఅయి దుందురు వజ్జై
మాలయింధన శాలి తహి భరు ఖాయియై
ప్రేంఖణ ఖేట కరెంటె శుద్ధా శుద్ధ న జానిఅయి
నిరాంశు అంగ చడాబియై తంహిజ సరాబా విపణియై
మలేయజే కుందురు బట్టై డిండిమ తహిణ వజ్జయిరే॥

హేరుకుని ధ్యానించాలి. మంత్రజపము వలన సాధకునికి రక్షణ కలుగును. సర్వజనులూ వశవర్తులగుదురు.

జ్ఞానసాధన రెండు విధములుగా నుండును.

1. సాపేక్షకం, 2. నిరపేక్షకం.

భౌతిక సుఖములు మల్లెపూవు వంటిది.

ధర్మ కాయము = హృదయ స్థానము
సంభోగకాయము = కంఠస్థానము
మహాసుఖకాయము = శిరః స్థానము.

విఘ్నములు కలిగించడం, వాటిని తొలగించడం వినాయకుని కార్యము. వినాయకులు చాలామంది కలరు. 2-4-6-8-10-16 మొ॥ భుజములు కలవారు కలరు. వారినే కొందరు నందికులు అంటారు.

వినాయకునికి బలి సమర్పణ మంత్రము -
ఓం ఇంద యమ జలజాక్ష
భూతవహ్ని వాయురక్ష
చందసుజ్జ మాద బప్ప

తల పాతాలే అట్టా సప్ప
ఇదంబలిం భోజ జిఘ
పుష్పధూప మాంస విఘ్నన్
అంహ కాజ్జ సవ్య సాధ
ఖంటి ఖుని ఫేఢ గాడ
ఓం అకారో ముఖం సర్వధర్మానాం ఆద్యనుత్పన్నత్వాత్
ఓం ఆః హూంఫట్ స్వాహా ॥

వినాయకదేవతానుగ్రహమువలన ఇష్టసిద్ధి - అరిష్టనివృత్తి కలుగును.

మనోవాక్కాయములు మూడూ పరిశుద్ధి పొందవలయును.

## 15. హేవజ్రాభ్యుదయం

హేవజ్రునికి 8 ముఖములు
4 కాళ్ళు
16 భుజములు
కపాలమాలాధారి
మారుని వశపరచుకున్నాడు
శరీరమంతా బూడిద పూసుకున్నాడు.
'హూంఫట్' అను మంత్రము నిరంతరం జపిస్తాడు
సమాధిలో నుంటాడు

ఎదుటి ముఖం నలుపురంగు

కుడిప్రక్క నున్న ముఖం తెలుపురంగు

ఎడమప్రక్క నున్న ముఖం ఎరుపురంగు

ఊర్ధ్వముఖం జ్వాలాముఖం

మిగిలిన ముఖాలన్నీ గాఢ నీలంరంగు

8 ముఖములకు మొత్తం 24 నేత్రములు.

తూర్పుద్వారమున - గౌరియోగిని ఉంటుంది - గంబీజం అపుడు మంథానునితో కలసి సమాధిగతుడవుతాడు.

దక్షిణద్వారమున - చేరియోగిని - చంబీజం ఇక్కడ వజ్రునితో కలసి సమాధి స్థితి పొందుతాడు.

పశ్చిమ ద్వారమున - వేతాళ యోగిని - వం

అజ్ఞానము - బంధము నాశనము చేస్తాడు.

ఉత్తరద్వారమున - ఘస్మరియోగిని - ఘం

ఇక్కడ కామమును నాశనము చేస్తాడు.

ఈశాన్య ద్వారమున - పుక్కసి యోగిని - పం

ఆగ్నేయమున - శావరియోగిన - శం

నైరుతిన - చండాలి యోగిని - చం

వాయువ్యమున - డొంబిని యోగిని - డంబీజం

## ఆయుధములు

గౌరియోగిని - కుడిచేతిలో కర్తరి
ఎడమచేతిలో మకర మత్స్యం
చేరియోగిని - డమరుకం
వరాహకం
వేతాళియోగిని - తాబేలు
పద్మపత్రం
ఝుస్మరియోగిని - సర్పము
పద్మ పత్రం
పుక్కసియోగిని - సింహం
- గొడ్డలి
శావరియోగిని - భిక్షు
- ఖింఖిరిక (ఖఖ్కర)
డొంబినియోగిని - వజ్రం (పిడుగు)
- తర్జనిముద్ర

ఈ యోగినులంతా ద్విభుజములు, త్రినేత్రములు కలవారు. అర్థ పర్యంక పద్ధతిలో కుడివైపున పర్యవేష్ఠితులై ఉంటారు.

గౌరి = నలుపు రంగులో ఉంటుంది - బ్రహ్మ చేరి = ఎరుపు రంగు - శక్ర

వేతాళి = బంగారు రంగు - నారాయణ.

ఘస్మం = ఆకుపచ్చ - మహేశ్వర

పుక్కసి - నీలంరంగు - వైవస్వత

శావరి - చంద్రకాంత శిలావర్ణ - విత్తనాయక

చండాలి - ధూమ్రవర్ణం (బూడిద) - నైరుతి

డొంబిని - రంగుల మిశ్రమం - వేమచిత్ర మారులతో కలసి ఉంటారు.

హేవజ్రధ్యాన శ్లోకం - (మంత్రోద్ధారం)

**శ్లో॥ ఓం వేదానా మాదిమంచైవ అర్థచంద్రేన భూషితం**
**పశ్చాదష్టాననాయేతి పింగోర్ధ్వ కేశవర్త్మనే,**
**చతుర్వింశతి నేత్రాయ తదనుషోడశ భుజాయ**
**కృష్ణజీమూత వపుషే కపాలమాలైక ధారిణే ।**
**ఆధ్మాతక్రూర చిత్తాయ అర్థేందు దంష్ట్రినే**

మారయ మారయ, కారయ కారయ, తర్జయ తర్జయ శోషయ శోషయ, సప్త సాగరాన్ బంధ బంధ, నాగాష్టకాన్ గృహ్ణ గృహ్ణ శతౄన్  హ - హా - హి - హీ -హు - హూ - హే - హై - హొ - హౌ - హం - హః - ఫట్ స్వాహా॥

మండల విధిపూజ గూర్చి - "తత్త్వ సంగ్రహం" అను గ్రంథము నందు విపులముగా వివరించబడినది.

అష్టవిద్యలు - 12 లేదా 16 సం॥ల బాలికల రూపములో ఆరాధించవలయును.

జనని – భగిని – దుహిత – భాగినేయి (మేనకోడలు) – భార్య – మాతృభగిని – పితృభగిని – స్వసా. వీరు అష్టవిద్యా మూర్తులకు ప్రతీకలుగా చెప్పబడినారు.

అర్చనా విధానము గురుముఖముగా గ్రహించవలయును.

## 16. పట విధానం

గురు - ఆచార్య - ఇష్టదేవతా ధ్యానం చేయాలి. గుణదూషణ – చెడు మాటలు వినకుండా ఉండేందుకు గుర్తుగా చెవులకు కుండలాలు ధరించాలి.

దివ్యమంత్రోచ్చారణ చేయుచూ, జపము ఎల్లప్పుడూ సాగించాలనేందుకు గుర్తుగా కంఠహారం ధరించాలి.

అహింసాధర్మ వ్రతమునకు గుర్తుగా, దానము చేయు సంకల్పమునకు గుర్తుగా రెండు చేతులకు కంకణములు ధరించాలి.

కామ నియంత్రణకు గుర్తుగా మొల చుట్టూ మేఖల ధరించాలి.

కృష్ణ పక్ష చతుర్దశి రోజున సాధన తప్పక చేయవలయును.

## 17. భోజనపటలం

భూర్జ పత్రములు శుభ్రము చేసి 12 అంగుళములు ప్రమాణముగా ఏర్పరచి, సుగంధ ద్రవ్యములో కలము ముంచి ప్రమాణ గ్రంధములు లిఖించవలయును.

వీటినో భక్తిశ్రద్ధలతో శిరోధార్యముగా భావించవల యును–రహస్యముగా ఈ పుస్తకములను భద్రపరచవలయును.

మండల పూజ జరుగునపుడు అతిధిగా ఎవరైనా వచ్చినచో వారిని భోజనముతో చక్కగా గౌరవించవలెను.

గిరి శిఖరములందు – రుద్ర భూములందు – సముద్ర తీర ప్రాంతమందు అతిధులకు విందు చేయవలయును.

అష్టయోగినులకు వృత్తాకారముగా స్థానములేర్పరచి మధ్యలో హేవజ్ర భావనతో సాధకుడు పులి చర్మము పై పరినిష్ఠితుడై యుండాలి.

మండలపూజలో ఉత్పల ముద్రతో మద్య పాత్రను గ్రహించాలి. ముందుగా గురువునకు నమస్కరించి అనంతరం సాధకుడు స్వీకరించాలి.

## 18. వినేయపటలం

శిష్యునకు ఉండవలసిన లక్షణములు పరిశీలించిన పిమ్మటనే గురువు ఉపదేశము చేయవలయును.

యోగ్యుడైన శిష్యునికి ముందుగా మహా విభాష - మధ్యమిక శాస్త్రము బోధించవలయును.

షట్కర్మలు తెలిసిన శిష్యుడు, మారణాది ఉగ్రకర్మలు గురువైన తథాగతునికి చెప్పకుండా ఆచరించరాదు. నిరంతరం ముద్రా - జపరతుడై యుండాలి.

సంసారమందలి విషయ వాంఛలకు, అనగా పంచేంద్రియముల ఇంద్రజాలమునకు సాధకుడు లోబడరాదు.

ఓం ఆః హూం ఫట్ స్వాహా అనుమంత్రముతో అష్టదిగ్బంధనము గావించవచ్చును.

## 19. జాప పటలం

జప సమయమునందు స్ఫటిక మాలనుపయోగించవలయును. క్షీరపానము మాత్రమే చేయవలయును.

వశ్యకర్మయందు చందనమాల

మారణమందు - అడవి పూసలు "సోప్ బెర్రీ" లేదా ఎనుబోతుఎముక పూసల మాల

విద్వేషణకు ముత్యముల మాల

ఆకర్షణ సిద్ధికి - బ్రహ్మాస్థిమాల

ఉచ్చాటనకు - మరకతమాల

వర్షము కురియుటకు - గజాస్థిమాల ఉపయోగించాలి.

# 20. సహజార్ధ పటలం

వజ్రసత్త్వ సాధనలో ధర్మచక్ర రీత్యా అష్టాంగములను ఆచరించి సాధకుడు పరిశుద్ధుడవ్వాలి.

ప్రజ్ఞాపారమిత అనుసరించాలి.

ధ్యానం –

ఓం పద్మసుఖాధార మహారాగ సుఖందద

చతురానంద భావక విశ్వ హూంహూం కార్యం కురుష్వమే

ఓ వజ్రమహాద్వేష చతురానందదాయక

ఖగముఖైక రసోనాథ హూంహూంకార్యం కురుష్వమే

శిరసి ఓంకారం, కింజల్కే ఆకారో

మహాశూన్య జ్ఞానము లేనివారు, జననమరణములు పొందుతూనే ఉంటారు. సద్గురువునాశ్రయించి నిర్వాణ సుఖము పొందాలి.

సమాప్తమ్